# శ్రీరామాచల పూర్ణబోధిని.

గ్రంధకర్త

బ్ర॥ హ్మ॥ శ్రీ॥ వారణాసి రామయ్య

హరిదాసు. గారు.

ప్రతులు. ౨౦౦౦

మ॥ రా॥ కొండా చెన్నరెడ్డి తమ్ముడు వెంకటరెడ్డి.
రాజశ్రీ చిరాగువీరన్న తమ్ముడు బుచ్చన్న.
తోటా ఈశ్వరయ్య. మొదలుగాగల సద్భక్తుల
ద్రవ్యసహాయముచే,
పంచాక్షరీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

హైదరాబాద్.
[దక్కన్.]

వైశాఖ॥ బ॥ ౧౩ మంగళవారం.

9.3

శ్రీదత్తాత్రేయాయనమః.

క॥ గురురూప నీమహాత్మ్యము । గుర్తెరుగరు నరులు మహాఘగుణములచేతన్ । గుటమాత్రమిచ్చి బ్రోవవే । గురురాజదత్తమూర్తీ గుణవిస్ఫూర్తీ ।

గ్రంథాభిమానులు.

బ్ర॥ శ్రీ॥ బ్రహ్మాండం నరసింహ్మారావు.
చివుకుల వెంకటాచల శాస్త్రి.
నారాయణం నరసింహ్మ శాస్త్రి.
పెద్దిబొట్ల సీతయ్యగారు.
భాస్కరబొట్ల చెల్లయ్యగారు.
తీగవరపు శేషయ్యగారు.
సాగి వెంకటరామయ్య. రామచంద్రయ్య.
వేమవరపు విశ్వనాథం॥
జానకి రామారావు.
లక్ష్మీరావు పట్వారి పేదమంగలారం.
కంభంపాటి రామక్రిష్ణ సోమయాజులుగారు.
ఏ. కాశీపతి గారు.
మశురబాద పాండురంగయ్య
సికింద్రాబాదు వైశ్యులు.

మ॥ రా॥ ముస్త్యాల మానయ్య.
బూరుగు విశ్వనాథం తమ్ముడు మహాదేవు వీరన్న.
వంగపల్లి వీరేశలింగం.
వంగపల్లి నీలకంఠం.
వుపలంచి రాజన్న.
తోట ఈశ్వరయ్య.
పాత లక్ష్మయ్య.
శ్రీరాం లింగమూర్తి.
మదూరి క్రిష్టయ్య.
తొడ్పునూరి కొండయ్య.
కోటంతల లింగన్న.



హరిః ఓమ్.

శ్రీ వాయుగురవే నమః

శ్రీ పాండురంగ పరబ్రహ్మణే నమః

శ్రీమదుపనిషత్ గోపాల జితేంద్రస్వామినే నమః

# శ్రీరామాయణ సూక్ష్మబోధిని.

శ్లో॥ శ్రీగురుం విఠలానందం । పరాత్పరజగత్ప్రభుమ్ ।
త్రైలోక్యవ్యాపకం దేవం । శుద్ధమత్యంతనిర్మలమ్ ॥

శ్లో॥ నమోస్తు రామాయ సలక్ష్మణాయ దేవ్యైచ తస్యై జనకాత్మజాయై । నమోస్తు రుద్రేంద్రయమానిలేభ్యో నమోస్తు చంద్రార్కమరుద్గణేభ్యః ॥ ... ... ... ... ... ...

శ్లో॥ లక్ష్మీర్యస్య పరిగ్రహః కమలభూః సూనుర్గరుత్మాన్ రథః ।
పౌత్రశ్చంద్రవిభూషణస్సురగురుః శేషశ్చశయ్యాసనః ।
బ్రహ్మాండం వరమందిరం సురగణా యస్య ప్రభోస్సేవకాః ।
స త్రైలోక్యకుటుంబపాలనపరః కుర్యాత్సదా మంగళమ్ ॥

,, బ్రహ్మా వాయుగిరీశ శేషగరుడా దేవేంద్రకామౌ గురుశ్చం
ద్రార్కౌ వరుణానలౌ మనుయమౌ విత్తేశవిఘ్నేశ్వరౌ ।
నాసత్యౌ నిఋతిర్మరుద్గణయుతాః పర్జన్యమిత్రాదయః ।
సస్త్రీకాస్సురపుంగవాః ప్రతిదినం కుర్వంతు నో మంగళమ్ ॥

,, విశ్వామిత్ర పరాశరౌర్వభృగవోగస్త్యః పులస్త్యః క్రతుః
శ్రీమానత్రిమరీచకౌత్సపులహాః శక్తిర్వసిష్ఠోంగిరాః ।
మాండవ్యో జమదగ్ని గౌతమ భరద్వాజాదయస్తాపసాః ।
శ్రీమద్విష్ణుపదాబ్జభక్తినిరతాః కుర్యాత్సదా మంగళమ్ ॥

౨౨౨ మాంధాతానహుషోంబరీషసగరౌ రాజాపృథుర్హైహయః।
శ్రీమాన్ ధర్మసుతోనలోదశరథో రామోయయాతిర్నృపః।
ఇక్ష్వాకుశ్చ విభీషణశ్చ మరుతస్సప్తైత నాపదఘ్నాః।
ఇత్యాద్యాఖ్యవిభూభుజఃప్రతిదినం కుర్యాత్సదామంగళమ్॥

౨౨౨ శ్రీమేరుర్హిమవాంశ్చమందరగిరిః కైలాసశైలస్తదా।
మాహేంద్రో మలయశ్చవింధ్యనిషధౌ సింహాస్తథాచైవ
తః। సహ్యాద్రిర్వరగంధమాదనగిరిస్త్వేనాక గోమంతకాః।
ఇత్యాద్యాఖ్యనభూభృతఃప్రతిదినంకుర్యాత్సదామంగళమ్॥

౨౨౨ గంగాసింధు సరస్వతీచ యమునా। గోదావరీ నర్మదా
కృష్ణా భీమరథీచ ఫల్గుసరయూః శ్రీగండకీ గోమతీ।
కావేరీ కపిలా ప్రయాగవినతా। వేత్రావతీ వ్యాదయో
నద్యఃశ్రీహరి పాదపంకజభవాః కుర్యాత్సదామంగళమ్॥

౨౨౨ వేదాశ్చోపనిషద్గణాశ్చ వివిధాస్సాంగాః పురాణాన్వితా
వేదాంతాఅపి మంత్ర తంత్ర సహితాస్తర్కాః స్మృతీనాం
గణాః కావ్యాలంకృతి నీతినాటకగణాశ్శబ్దాశ్చనానావిధాః
శ్రీవిష్ణోర్గుణరాశి కీర్తనపరాః కుర్యాత్సదామంగళమ్॥

౨౨౨ ఆదిత్యాది నవగ్రహాశ్శుభకరా మేషాదయోరాశయః
నక్షత్రాణి సయోగకాశ్చ తిథయస్తద్దేవతాస్తద్గణాః। మా
సాబ్దాఋతవస్తథైవ దివసా స్సంధ్యాస్తథారాత్రయః। స
ర్వే స్థావరజంగమాఃప్రతిదినం కుర్యాత్సదా మంగళమ్॥

౨౨౨ ఇత్యేతద్వర మంగళాష్టకమిదం శ్రీవాదిరాజేశ్వరై ర్వ్యా
ఖ్యాతం జగతామభీష్ట ఫలదంసర్వాశుభధ్వంసనం। మాం
గల్యాది శుభక్రియాసు సతతం సంధ్యాసుయఃపఠేద్ధ
ర్మార్థాదిసమస్తవాంఛితఫలం ప్రాప్నోత్యసౌమానవః॥

వాదిరాజకృత మంగళాష్టకం సంపూర్ణమ్.

శ్రీకృష్ణార్పణమస్తు.



హరిఃఓమ్.

శ్రీ దత్తాత్రేయాయనమః

శ్రీ గోపాల స్వామి సద్గురవే నమః.

# శ్రీ రామాచల పూర్ణబోధిని.





## —※ నాంది. ※—

శా. శ్రీరామాచల పూర్ణ బోధకుఁడవై చిద్రూప తేజుండవై।
సారాచార విచారనిర్గుణుఁడవై సన్మౌని పాత్రుండవై ధీరాకా
శపరా పరాత్పరుఁడవై దేదీప్య మానుండవై కారుణ్యంబున
దాస పోషకుఁడవై కన్పట్టు నిన్ వేఁడెదన్. ...

## దైవ ప్రార్థన.

సీ. శాంతాయ దాంతాయ సత్యస్వరూపాయ శ్యామలదేహాయ
శరణుశరణు। యోగసంపూర్ణాయ యోగాధినాథాయ సచ్చిదా
నందాయ శరణు శరణు। నిర్గుణబ్రహ్మాయ నిర్మలాకారాయ
సద్రూప చిద్రూప శరణుశరణు। బ్రహ్మాండ ఖండాది ప్రా
ణాధి దేవాయ సారవిచారాయ శరణు శరణు గీ. సంచితా
ఘ వినాశాయ శరణు శరణు గరుడవాహనాదిహాధాయ శరణు
శరణు పరమ.పురుషాయ బ్రహ్మాయ శరణు శరణు సత్యచరి
త్రాయ నిత్యాయ శరణుశరణు ॥ ..

పాలరాధికా ప్రాణలోల ॥

—( గ్రంథకర్త )—

గీ ॥ పరగగోపాలదేశిక ప్రభుని పాద । పద్మములభక్తిసల్పెడి సా
గసారి । రామయాఖ్యాత సజ్జనశ్రేష్ఠుఁడఁడ । దత్తయోగిం
ద్రుగొలిచెడి ధరణీసురుఁడ ॥

గీ ॥ కోటయాప్పల్లనూరం బలకోర్కెదీర । వసుధహరితసగోత్ర వి
వర్ధనముగ । బుట్టిగోపాలదేశికు భోధనలన దత్తయోగీంద్ర
పదపద్మ ధ్యానమంటి ॥

క ॥ హరిసేవాద్యర్చ నలును । గురుభక్తియు తత్వమహిమ గుఱు
తెఱుఁగ । సద్గురువరుఁడు పూర్ణప్రపజో । హరిదాసను నా
మమిడియె యాధ్వానసుచున్ ॥

కావున నాయిష్టదైవమగు శ్రీదత్తాత్రేయులను నేజెప్పెడుబోవు
పూర్ణబోధ సర్వోష్ణమౌగాఁ బరసమాప్తి నొందించుటకు కరకమలం
బుల ముకుళించి యథాశక్తి పూజగావించి ప్రార్థింపు చున్నాడను.

గీ ॥ అత్రితనూజ సూయ దంపతుల్ హర్షమొందు । యోగమార్గ
ప్రవృత్తి విరోగపతివి । సత్వసద్గుణ సద్రూప సత్యదేవ ।
తాపసకులవివర్ధన దత్తమూర్తి ॥

గీ ॥ సగుణనిర్గుణ బ్రహ్మైక్య సాధనములు । శాశ్వతానంద దా
యకమా చరిత రచన । సేయబూనితిగావున శ్రీశకేశ । తప్పు
విడి యొప్పొనరజూడు దత్తమూర్తి ॥

గీ ॥ జ్ఞానసంచయ మొప్పెడి ఘనతనెంచి । సజ్జనావళికాహ్లాదజనిత
మైన । కావ్యముగ జేసి యాబ్రహ్మకల్పములను ధాత్రివ్యాపిం
ప । జేయుము దత్తమూర్తి ॥

గీ ॥ శంఖచక్రములును గద శార్ఙ్గకమురు । దండములునారు భుజ
ముల దాల్చి నాసవపుల పోషింతువని నమ్మి వాంఛదీర । చి
త్తమునరగ ధ్యానింతు దత్తమూర్తి ॥

గీ॥ వేదవేదార్థతత్త్వ వివేకశీల । శుద్ధనిర్గుణ పరమాత్మసుం
దరాంగ । వందితాకారసన్మౌని వరకుమార । ధ్యానమును జే
తు నిన్నదె దత్తమూర్తి ॥

గీ॥ సగుణనిర్గుణబ్రహ్మైక్య సరణిజూపు । సద్గురూపక సగుణా
త్మసత్యదేవ । నిన్ను యావాహనము జేతునిర్మలముగ దాస
హృదయంబునను నిల్వ దత్తమూర్తి ॥

గీ॥ మణిమయంబగుసింహాసనంబు నమరి । జేసితిని విశ్రమింపుము
శ్రీముకుంద । భువనరక్షణకేశవ భోగిశయన । తడవుసేయకే
గూర్చుండు దత్తమూర్తి ॥

గీ॥ నిర్మలంబగుహృదయంబు నివ్వటిలగ । సద్గుణైశ్వర్య పూర్ణత
నెఱిఁగియుండి । ఆసనంబిచ్చువాఁడ నీవందుఁదలచి । దయను
పూజలు గైకొను దత్తమూర్తి ॥

గీ॥ అర్ఘ్యమర్పింతు జ్ఞానానంద తేజ । దాసజనపాలముక్తి
సంధానశీల । జ్ఞానసంచయగుణలోల ఘనకృపాల । దైవరా
యడ గైకొను దత్తమూర్తి ॥

గీ॥ సర్వకర్మ నిరాకృతి సలిపి మరియు । నిశ్చయజ్ఞానచిత్తంబు ని
చ్చిపిదప । మున్మనీభావపాద్యంబు నొప్పగింతు । దయను గై
కొనుమయ్య శ్రీ దత్తమూర్తి ॥

గీ॥ సత్తుచిత్తులపూజ్యంబు సంమవెలుగు । సచ్చిదానందరూప
మోసత్యదేవ । అమలపంచామృతస్నాన మమర జేతు ।
దాసవరదుడ గైకొను దత్తమూర్తి ॥

గీ॥ యమున గంగయు కావేరి మొదలుగాను । నదుల జలములు
స్నానంబునకును యోగ్యమనుచు దెచ్చి సమర్పింతు మార
తేజ । దయనుగొని స్నానమును జేయు దత్తమూర్తి ॥

గీ॥ పరగ శుద్ధోదకంబత్తు పరమపురుష । స్నానమును జేసి సుజ్ఞాన
స్వానుభూతి । జాతివంశాశ్రమములఁ సంభ్రమవిడిచి । ధన్యత

గీ॥ మంత్ర మంత్రార్థములు తెలియమిఁ జేసి నీకు మూర్తి । నీకు నర్పించెడు నైవేద్యము మంత్ర । పుష్ప మర్పింతు నాదగు పుణ్యమ నను । దయ దలిర్పగ గావుమా శ్రీదత్తమూర్తి ॥

గీ॥ అక్షతాంధవళాకారము నెడిరీతి । నక్షతలును సద్గుణను జేతు నవధరించు । సంతసము నొందు నిర్గుణానస్యతేజ । ధర్మ దీక్షాప దైవము దత్తమూర్తి ॥

గీ॥ మత్త మాతంగ హయ సింహమాది వాహ । నములు ఛత్రము వింజామర మకన్నృత్త । గీతవాద్యములెల్ల సంప్రీతిగాగ । దాస దాసుఁడ నర్పింతు దత్తమూర్తి ॥

గీ॥ హంసతూలికగాను యోనాదిశేషు । ఫణులపై బవ్వళించెడి భవవిదార । చెలువమమరగ నవరత్నదోలికందు । దయదలిర్పగ నిదురించు దత్తమూర్తి ॥

గీ॥ నీవు నిదురించ లోకముల్నిద్రనుందు నదులు । గ్రుంకుచు నీయెడి జ్ఞానంబు రూఢదెలిసి । లాలిపాటల లక్ష్యములను । దలపులోన నెఱుంగుము దత్తమూర్తి ॥

గీ॥ ప్రకృతితోఁ గూడిచెరియుంచు ప్రజ్ఞవెలయు । జ్ఞానమజ్ఞానమిం ద్రియ ఘనతనిలిపి । హెచ్చుచుతి డ బలికెడి హెచ్చరికలు దైవరాయఁడ గనుమాన్య దత్తమూర్తి ॥

గీ॥ భైరవాదిసమూహము ప్రమథగణము । వెంటనంటియును౦డి విశ్వవిడ । మంత్రహీన క్రియాహీన మనుతబాయ । దయచు నేలుము సత్వర దత్తమూర్తి ॥

గీ॥ భక్తితోడుతనర్పించు పత్రపుష్ప । ఫలము తోయములనెల్ల ను బహుళముగను । నెంచిబోచెడి దైవము నీవెగాన । దాస దాసుఁడ ననుగావు దత్తమూర్తి ॥



శౌనక మహామునులారా!

సీ ॥ బహుజన్మపుణ్యఫలంబులైనట్టి సుజన్ములై వేదవేదాంగాది వి
హితవిధులు । యజనయాజనములు నశేషమౌని సిద్ధులు స్నా
నసంధ్యావందనాలు జపసమాధులును । ధర్మతత్త్వవిదులు నానశీలంబు
లు సత్యంబు శాంతంబు శమము దమము । పుత్రుల పౌత్రు
లు పుణ్యసతుల్ ఘనవిత్తవైభవములు విపులయశము ॥

గీ ॥ భోగభాగ్యము లెల్లను పొందగలుగు । భువిని శ్రీరామయచల
సంపూర్ణబోధ । యనుచు విబుధులు వచియించు యార్షవి
ధులు వ్రాసినాడను ప్రాజ్ఞత వర్ధిలంగ ॥

కథాప్రారంభము.

క ॥ పలువిధవృక్షలతాదులు । ఫలపుష్పచయంబులొప్ప పక్షి
మృగాదుల్ । చెలువమున మైత్రిమెలగను । సలిలాశయముగనుం
డనైమిశవనమలరెన్ ॥

వ ॥ అట్టి నైమిశారణ్యమున, నిఖిలపురాణవ్యాఖ్యానము సెల్వు
సూతపౌరాణికుని శౌనకాదిమునిపుంగవులు గాంచి నుతించి శ్రీరామా
చలపూర్ణబోధని కథాశ్రవణకుతూహల సంజాతచిత్తులై, ఒకనాడు.

క ॥ జేయుము శౌనకుండాదిగ । వారలు సూతుని నుతించి వరగుణభ
రితా । శ్రీరామాచలమునగల । సారము చెలుపంగదయ్యా
సత్వోదితమునన్ ॥

క ॥ విని సూతుండు ఋషులకు విరా । మనమునగల సందియమును
మానగవేగం । బున శ్రీరామాచలమును । ఘనతత్వము దె
లుపువాడగని వినిరంతన్ ॥

వ ॥ మహాఋషులారా! సావధానచిత్తులై నాలింపుడు. సర్వభూత
ముల యందాత్మస్వరూపుడును, [illegible] ఆది
మధ్యాంతరహితుండును, అవాఙ్మానసగోచరుండును [illegible]

"శ్రీమన్నారాయణ" అను మహావాక్య శుద్ధతత్త్వార్థగ్రాహియగునట్టి పరబ్ర
హ్మమును ప్రణవస్వరూపునిగా జనులందరకును, నారాయణుని గూర్చి
తపంబొనరించిన వారిచే తెలిసికొనియెను. ఆకోటిదినన, చతురాన
నా! మహత్తత్త్వము నాయందుండుట నా తేజోగర్భమున నేను సమస్తభూతము
లకుఁ కారణభూతుఁడను. సర్వమునకు ఈశ్వరుఁడను. అద్యంతములు బ
హిరంతరములు లేక యెల్లెడల నిండియుండు పరమపురుషుఁడను. అ
వ్యాప్తమయుఁడను. అప్రమేయుఁడను. ఆనందమాత్రుఁడను. ఆద్య, అ
నవద్య, అనన్య, అవికార, అశోక, అనంత, అఖండ, అభేద, అద్వితీ
య, అక్షయ, అవ్యయుఁడనై వెలుఁగు పరబ్రహ్మను. నన్ను బ్రహ్మమ
నియు, ధర్మమనియు, సర్వేశ్వరుండనియు, సర్వకర్తుండనియు, అవ్య
యుండనియు, అచ్యుతుండనియు, పరమాత్ముండనియు, పరతత్త్వమని
యు, పరిపరివిధముల నూహింతురు. సదసత్తులు, ద్వైతాద్వైతము
లు, మొదలగు నన్నియు నాశ్రయభూతుండనై యుందును.

సముద్రమొక్కటియయ్యును, తరంగములు పెక్కులుగా గాన్పించున
ట్లు వస్తుభేదములచే పెక్కురూపములుగఁ దోచఁబడును. అద్భుత
వినోదముల, మాయచేత సకల ప్రపంచమెల్లఁ గప్పఁబడియున్నదో అట్టి
నిర్గుణుండను. వాయువువలె సమస్తమునందు నిండియుందును. నాకుజీ
వత్వము చెప్పఁగూడదు. అధిష్ఠాన చైతన్య, ప్రతిబింబచైతన్యములనుజే
ర్చిచెప్పవచ్చునన్న, అవి కేవలచైతన్యమాత్ర నిర్వికారములు. కర్తృత్వ
భోక్తృత్వాది వికారలక్షణముగ జీవత్వము చెప్పఁగూడదు. అంతఃక
రణము తదధిష్ఠానచైతన్యమును, తత్ప్రతిబింబచైతన్యమును జేర్చియే జీ
వుఁడని చెప్పవలసినది. జీవుఁడనేకానర్థములకు విషయమగును, ముఖ్యకా
రణము. విజ్ఞానరహితమే యైనను, నిత్యానుకజాయమాన కృపగలవాఁ
డను. నాకును జీవునకును, జన్యజనకత్వమని, ప్రాప్య ప్రాపకత్వమ
ని, ఆధిపత్యాధపత్యమని, ప్రేరణ ప్రేరకత్వమని, వేద్య వేదకత్వమ
ని, అంశాంశిత్వమని, పలువిధ సంబంధములు గలిగియుండును. జన్య జ

నకర్తృత్వమునకుగా, నేను మాయావృత్తిచే జనింపజేసినవాడను. జీవులు అవిద్యావృత్తిచే జనించిరి. ప్రాప్యప్రాపకత్వమున, జ్ఞానసాధనంబుచే పొందవలసిన వారలను నాలో జేర్చుకొనువాడను. ఆశ్రితత్వాశ్రయత్వమున, లీలావిభూతికి లోబడినజీవులను, నే నేలెడివాడను. ప్రేర్యప్రేరకత్వమున, పుణ్యపాపములననుసరించి, స్వర్గనరకముల పొందెడువారలను, కర్మానుసారముగ బోధించువాడను. వేద్యవేదకత్వమున, ఇంద్రియములకు గోచరములగు పదార్థములను గ్రహింపవలసినవారలను, పదార్థాభిజ్ఞానమును గలిగించువాడను. అంశాంశకత్వమున, నాస్వరూపమువలన నుద్భవించిన జీవులకు నేనాశ్రయమైనవాడను. ధర్మజ్ఞుడను. ధర్మప్రవర్తకుడను. దయామయుండను. ధర్మపాలకుడను. దీనబంధుడను సనాతనపరమాత్మను. జ్ఞానసూర్యోదయము ప్రకాశింపగలవాడను. సూర్యుడును చీకటియునొక్కచో వాసము చేయునట్టుల మాయయును, నావిద్యయు చిద్రూపుడనగు నాతోను, సంబంధము గలుగనేరదు.

మాయను తొలగించిచూచిన, నేనే పరబ్రహ్మమని తెల్లమగును. పరబ్రహ్మమని, తెలుసుకొను తెలివి సహజమేకాని, జన్యముగాదు. యథార్థజ్ఞానము ప్రకాశింపకపోవుటకు, కారణము ప్రతిబంధము. అది భూతప్రతిబంధమని, వర్తమానప్రతిబంధమని, భావిప్రతిబంధమని. మూడువిధములుగ నుండును.

అస్తి, భాతి, ప్రియ నామరూపములను. లక్షణములైదింటిలో నామరూపముల ద్రోసివేసిన తక్కిన మూడును, కొంతకాలములోనే నశించిపోయి, సచ్చిదానందరూపము నిస్సంశయముగా పట్టుబడును. వర్తమానప్రతిబంధము, విషయాసక్తిలక్షణమని ప్రజ్ఞామాంద్యమని, కుతర్కమని, విపర్యయదురాగ్రహము, నాలుగువిధములుగానుండును. విషయాసక్తిలక్షణమనగా సమస్తవిషయములందును స్నేహము నాసక్తియుండుట. ప్రజ్ఞామాంద్యమన గురుపదేశించిన

యోగము బుద్ధికెక్కకపోవును. కుతర్కమున, గురువులు బోధించినయ
ర్థమునకు విపరీతార్థములు తోచును. విపర్యయము దురాగ్రహమున,
నేను పండితుఁడను శ్రోత్రియుఁడను భక్తుఁడను విరక్తుఁడనని దేహేం
ద్రియాదుల యందాత్మతత్త్వబుద్ధికలుగుట విపర్యయము. విషయాసక్తి యు
క్షణము శమదమోపరతితితిక్షలవలనను. అజ్ఞానాంధకారము నిరంత
రశ్రవణమువలనను, కుతర్కము మననమువలనను, విపర్యయము దు
రాగ్రహము నిదిధ్యాసము వలనను నశించి పోవును.

ఇవి నశించిన యాత్మతత్త్వము కరతలామలకమగును.
కాలనియతిలేక సంభవించు సంచితపాప కర్మము వలన నాస్తికులగు
ను అదియే భ్రాంతి బంధమనంబడును దానివలనఁ గొన్ని జన్మము
లెత్తవలసి వచ్చును. ఈ యజ్ఞానము తొలఁగుటకు గురువుయొక్క అను
గ్రహము కావలసి యుండును ఆ యనుగ్రహము సత్త్వగుణమున - స
త్త్వము సద్ధర్మమున - సద్ధర్మము శ్రుతిస్మృతుల విధు లెఱుంగుటవల
న - అయ్యది సజ్జన సహవాసమున - ఆ సహవాసము - కామాద్యరి
వర్గ నిగ్రహమున - నది భూతదయవలనను గలుగును.
శీతోష్ణములు - క్షుత్పిపాసలు - సుఖదుఃఖములు - ప్రియాప్రియము
లు సమదృష్టిగా భావించి - నిగ్రహించి - విశ్వతైజసప్రాజ్ఞవిరా
డ్ హిరణ్యగర్భ అవ్యాకృతములను - వదలినను - సహజానంద
ము ననుభవింపవలెను.
వాగ్విధాడంబరముల వచు కనుగొనఁజాలరు. శుచిత్వమున, సత్త్వ
ము. అందున, పావనత్వము. దానిచే, చిత్తైకాగ్ర్యము. అందున, ఇం
ద్రియనిగ్రహము. అందువలన, నాత్మధర్మయోగ్యతయుఁ గ్రమక్రమ
ముగాఁగలుగును. సత్తి సంతోషములవారికి బ్రహ్మానందానుభ
వము నిరతిశయానందము గలుగును. వేదోక్తసూత్రములలో, ని
ష్టముగువాని ప్రశస్తపూర్వకముగా బోధించి, అహంరూపముల ప్రత్య
క్షమై సర్వాభీష్టసిద్ధిని గలుగఁజేయుచున్నవి

శ్రీరామాచలపూర్ణబోధిని.

సంసారి కాసమే జాగృత్స్థితి. ఇదియే ఉపనిషద్వాక్యసారము. ఈ స్వయంప్రకాశమే సంపూర్ణబోధనే తెలుసుకొందగు అచల బ్రహ్మము. బాహ్యాంతర బరము లేక శాశ్వతనిర్గుణముగు తెలియునెరుగు మార్గమును, జీవన్ముక్తి తెలుపును తెలుసుకొనగలిగిరి. ధన్యతనొందగలిరి. అని శ్రీమద్రామాయణందగు నిర్గుణబ్రహ్మచే బోధింపబడెనని నే వినియుంటిని. ఓ మహాత్ములారా! మీరాస వినయములు కాయుడు. అనిన సూతుని శౌనకాదులు మరల ప్రశ్నించిరి.

సూతమహారాశికుండా! ఇతు గానము చెప్పిన సిదప, యేయేరీతిగా వ్యాప్తి బొందినది. ఎవరెవరేయే బోధకుల ననుష్ఠించి ధన్యత జెందిరని మాయెడద నుగలవాడవై దెలుపుమని కోరిరి. అనంతరమా సూతుండు జెప్ప దొడగెను.

మహాత్ములారా! బ్రహ్మ దెలిసికొనినవాదిగా అచలబ్రహ్మబోధ, వసిష్ఠ, వామదేవ, కణ్వ, బృహస్పతి, అత్రి మొదలగు తపోధనులు, పూర్ణబోధామృతపానరసికులైనారు. ముఖ్య బ్రహ్మ మొదలగు దేవతలును, విశ్వామిత్రాదిగాగల రాజర్షులును, మాంధాత మొదలగు మహారాజులును, మరియు ననేకులు, అచలబ్రహ్మానందమగ్నులై బ్రహ్మాత్వసిద్ధినిబొందిరి. సూర్యవంశపు రాజులకు కులగురుడునై వసిష్ఠుడు, వసిష్ఠుచే సూర్యవంశపు రాజులగు ఇక్ష్వాకు, ముచుకుందుడు, మాంధాతృనగరపురుకుత్సాదు, పురూరవుడు, అంబరీషుడు, సత్యవ్రతుడు, త్రిశంకుడు, హరిశ్చంద్రుడు, రోహితాస్యుడు. దిలీపుడు, భగీరథుడు, రఘుమహారాజు, అజుడు, దశరథుడు, శ్రీరాముడు, జ్ఞానవాశిష్ఠ, యోగవాసిష్ఠ, బృహద్వాశిష్ఠములను త్రివిధబోధలచే సంపూర్ణతనొంది శాశ్వతానంద దాయులయ్యారు.

సీ॥ అచల సంపూర్ణత నంతనెఱింగియు
బ్రహ్మసృష్టిని జేయ ప్రాజ్ఞుడయ్యె।
అచలసంపూర్ణత నామోదమున భృగు

శిష్యుల కెఱుగించ శ్రేష్ఠులైరి ।
అచలసంపూర్ణత కాహ్లాదమొంది
నిదాఘుడు సూర్యుండు ధన్యులైరి ।
అచలసంపూర్ణత కానందమగ్నత
పరశురాముఁడు జెంది ప్రతిభఁగాంచె ।
అచలసంపూర్ణత యాజ్ఞవల్క్యయుగాంచి
జనకుఁడాదిగ వారి ఘనతనిలిపె ।
అచలసంపూర్ణత ననుభవమున శుకుండా
నందబోధయె యచలమనియె ।
అచలసంపూర్ణత నరసఖునకు దెల్పి సాం
దీపుఁడైశ్వర్య సాధనమనె ।
అచలసంపూర్ణత యానందమయమని
శివరామయవధూత చెప్పియుండ ॥

గీ ॥ భువిని నరసింహ్మాయవధూతబోధవలన ।
బఱగ గోపాలయవధూతపాలుగొనియె ।
గాన, సుజ్ఞానబోధనుగాంచువారు ।
భ్రాంతివిరహిత పదవినిబడయగలరు ॥

సీ ॥ దూర్వాసుకోపంబు దొలగించు ధీశక్తి
యంబరీషున కెట్టియశము నిలిపె ।
కార్తవీర్యార్జునుం డార్తరక్షణసేయు
బుద్ధినిల్పెను పరిపూర్ణబోధ ।
కార్యదీక్షను శౌర్యగాంభీర్యబలములు
విజయుడు గైకొన్న విమలయశము ।
ధర్మదేవత తాప తప్తత బాపంగ
ఉత్తరకొమరున కొప్పినట్టి ॥

గీ ॥ ఘనతలకుమూలమైన దిజ్ఞానబలము ।

వింతకన్ననుదెల్పెనదెద్ది లేదు। నిగుణైశ్వర్య సంపద నేర్పాగనెడి
భక్తిజ్ఞానంబుగలుగును ప్రాజ్ఞులకును॥
సీ॥ శ్రీరామయచలమే స్థిరమైనసంపద
శాశ్వతానందమౌ సత్యయశము।
శ్రీరామయచలమె సురచిరవిభవంబు
మాయనుదొలంగించు మహిమ నెలవు।
శ్రీరామయచలమే సారవిహీనమౌ క్రూ
రసంసారంబు గూల్చుశరము।
శ్రీరామయచలమే శ్రేయమౌబ్రహ్మంబు
సాయుజ్యమును జేరుసాధనంబు॥
గీ॥ యనుచు విష్ణుండు బ్రహ్మకు యానతిచ్చె।
నట్టి సుజ్ఞానభావంబు నరయు వారు॥
నిర్గుణబ్రహ్మపదవిని నెలవు గనియు।
సచ్చిదానందమును గాంచు సౌఖ్యమొదవు॥
సీ॥ వేదార్థతత్వ వివేకంబుగలిగిన, భ
క్తిభావంబును పరిఢవిల్లు।
అందున సుజ్ఞాన, మందున వైరాగ్య,
మందున సాయుజ్యమబ్బు మరియు।
సారూప్యమునుఘన సాలోక్యపదవియు,
శాశ్వతానందంబు సంభవించు।
సంతతసౌఖ్యమై జన్మరాహిత్యమై బ్ర
హ్మంబుతానైయె ప్రతిభ వెలయు॥
గీ॥ గాన సుజ్ఞాన భావంబు గలుగునట్టి।
సత్యమౌ నామహితమును సరకుజేసి।
మూలకారణభూతుని మోదమునను।
పూర్ణబోధామృతంబున బొందరయ్య॥

# త్రిశంకుచరిత్రము.

సీ॥ పరిపూర్ణబోధను బ్రహ్మచేతవశిష్ఠు। బొందియుత్రివిధంబు
పొసగజేసి। యందునసెక్కటి యవనీశుఁడౌపుర। కుత్సునకును దె
ల్ప గురుడునగుచు। వారివంశంబున వసుధపైజన్మించు। పురుషులనె
ల్లను బోధజేసె। నందుసత్యవ్రతుండను వానిసుతుడు త్రిశంకుండు
సాత్వికచక్రవర్తి॥ గీ॥ సత్యధర్మంబు శాంతంబు శమదమమును।
గలిగెధర్మయుక్తుఁడై జ్ఞానమునను। రాజ్యపాలనసేయుచు రాజులెల్ల।
కప్పములు నర్పణముసేయ ఘనతగాంచె॥

పంచపాదిగీతం॥ పరగకోసలకును ముఖ్యపట్టణముగ। వరన,యో
ధ్యాపుర వరమువన్నెకెక్క। పరమసాధ్వి యగుసత్యపట్టమహిషి।
సద్గుణంబులపతిచర్య సలుపగొనుచు। సంతతియులేని చింతచేజగతి
నేలె॥ వ॥ చతుస్సముద్ర ముద్రిత ధరామండలంబునఁ గల నిఖి
లఖండములలో సకలసంపత్పరి పూర్ణంబగు భరతఖండమున.

శ్లో॥ అయోధ్యాను మహత్పుణ్యా। రాజధానీ బభూవహ। మా
నవేంద్రేణమనునా। యాపురీ నిర్మితాస్వయం। సరయూద
క్షిణేతీరే విచిత్రతరశోభితే। స్థితాసానగరీహేమ ప్రాకార
పరిశోభితా॥ అగాధతోయపరిఖావిచిత్రమణిగోపురా। చిత్ర
ధ్వజపతాకైశ్చైతో రణైరుపశోభితా॥ ప్రాసాదహర్మ్య
సౌధాద్యై రుపకార్యాభిరుజ్వలా। శృంగాటకశతాక్రాంతా
చత్వరైర్ధార్ణతు చిత్రితైః॥

అనుకీతిగ సర్వమంగళాభ్యుదయనివాసంబై హిమమహీధరం
బుపోలికను - ధర్మాస్పద రూపరమ్యంబై శ్వేతద్వీపంబు కరణిఁబు
ణ్యజనానంద సమృద్ధిదంబై. అలకాపురంబు లీలను నవనిధియుతం
బై వరుణపురంబుపోలిక రాజహంసాభి శోభితంబై అమరావతీ పట్ట
ణంబు చాడ్పున విబుధ జనమనోరంజనకరంబై పద్మాకరంబు వైఖ
రిఁ జతురాస్యవాణీ ప్రచురంబై సత్యలోక వైకుంఠ కైలాసము లా

క్కచోఁగూడి యుండినవో యనునటుల - బంగారు ప్రాకారములు- నభ్రంకషములో యనఁదగు సౌధములు - మంత్రులకనువగు కట్టడములు - పురోహితులకుఁ దగుగృహములు - అశ్వరథ గజశాలలు - మెరుపుతీగెలభాతి ప్రకాశితంబులగు మణిమయ మంటపములు - విచిత్రతర. చిత్రితములచేనొప్పు - అంతఃపురములు - తరులతాదులచే నిండి. ఫలపుష్పభరితంబైయొప్పు. వనములు - చల్లని తేట తియ్యనీరుగల కాసారములును- మయూరము లిరుప్రక్కల నాణిముత్యములు నోటగఱచుకొనియుండ నడుమ రత్నఖచితమగు, సింహాసనమును,కడు రమ్యముగా భాశిల్లుచుండెను - అప్పురవరమునందు,

గీ॥ వేద వేదాంగ తత్వార్థవేత్తలగుచు । జప తపాదులు యజ్ఞ
ముల్ చైనవాజ । పేయమును జేసి సద్ధర్మ విహితమునను ।
పరగసంపత్సమృద్ధు లౌబ్రహ్మవిదులు ॥

గీ॥ బాహుబలశౌర్యధైర్యంబు ప్రౌఢినొప్పు । శీలసౌందర్యసౌజ
జన్యశ్రేయములను । క్షత్రియోత్తములనెడి విఖ్యలుపమతు
లు । వేడుకలరగ నుండి రప్పోటియందు ॥

గీ॥ ధనసమృద్ధియు వ్యాపారతత్పరతయు । సత్యవర్తనదానంబు
స్వకుల శీల । ములును, విద్యావివేకత పుణ్యయశము । భ
క్తివైరాగ్యములుగలవైశ్యవరులు ॥

గీ॥ పరగమోటాటి గూడాటి పాకనాటి । మొదలుగాగల కాపు
లుమోదమలర । పంటలధికంబు గోవృషభములుపెక్కు ।
గలిగి. విద్యావివేకులై ఖ్యాతిగనిరి ॥

గీ॥ హరిసేవాద్యర్చనలును । హరిభక్తియు కీర్తనములు నచలార్థం
బుల్ । గురు తెలిఁగినసుజ్ఞానులు కరమరుదుగ । పెక్కుమంది
గలరప్పోటిక ॥

క॥ బీదలు లేరాపురమున । సాధువులును పెక్కుగలిగి సంభావి
తులై। మోదమునరాజుకృపగొని । సాధించిరి యోగములను
శాశ్వత పదవుల్ ॥

గీ॥ యోగదండకమండల యోగమాల । వ్యాఘ్రచర్మంబు భ
స్మంబు బరగదాల్చి । పరమహంసలు బ్రహ్మైక్య భావప
రులు । సంతసంబున కాలంబు జరుపుచుండ్రి ॥

గీ॥ పరగయవధూత భావంబు పరిఢవిల్ల । సచ్చిదానంద పరబ్ర
హ్మ సత్యమనెడి । బోధనలు సేయు పుణ్యు లప్పురమునందు।
గూడియుండిరి దమతమ కోరికలర ॥

గీ॥ తాళరాగ స్వరమ్ములు దప్పకుండ । భరతనృత్తంబు లందు
న ప్రౌఢులగుచు । కాలగతుల నివేదించు జ్ఞానమొప్ప । గా
యకావళి బహుమంది గలరుఘనులు ॥

ఉ॥ పాలనశీలమున్ విమల భారములాదిగ నొప్పిపృథ్వినిన్ । బా
లనసేయు భూపతియు భానుకులంబును వాసికెందవా । చా
లతవిద్య ప్రోడిమలు శాంతసుధీరులు రాజకీయమున్ । జాలి
నయుక్తియుక్తముల జర్పెడువారగు మంత్రిశేఖరుల్ ॥

క॥ ఈవెలుమొదలగు శరములు । సూటిగధరియించి మన్నె సు
ల్తానులనన్ । సీటుగల వెలమ దొరలే । ర్పాటగుకప్పములని
చ్చి బడసిరి యశమున్ ॥

క॥ నియమిత కప్పములిచ్చుచు । భయభక్తులు మెలఁగికమ్మ వం
శజులిలపై । నయమున రాజవరేణ్యుని । జయగొని తమశర్మ
ములను జనిసినవారల్ ॥

గీ॥ రెడ్డిక్షత్రియ దొరలు సుప్రసిద్ధులగుచు । బాహుబల శౌర్య
ధుర్యులై ప్రబలమైన । కార్యములయందు మంత్రుల కనువు
గాను । యోచనలుచెప్పి పనులందు యొప్పిమరియు ॥

ఉ॥ కొందరు న్యాయమూర్తులును కొందరుసైన్యపు దండనాథు
లున్ । కొందరు న్యాయవాదులును కొందరు రాజులు గాను
యొప్పియా । నందము సందడింపజన నాథునిమెప్పును గాంచి
భూజనా । వందితులౌచు దేశముల వాసివహించిరి రెడ్డిక్షత్రి

యుల్ ॥

పంజిమాగధులును, సుకవులును - గజహయబలమును - పదాతు
లును - గలిగియుండెను - మరియు. త్రిమతములవారు మతద్వేషులు
గాక - శైవరాజ భక్తిచే - ప్రజానురక్తిగల త్రిశంకు చక్రవర్తిని పొ
గడుచుండిరి । రాజచంద్రునిచే నియమింపఁబడిన - పాఠశాల లనే
కములు గలవు. అందు వైష్ణవ సాంప్రదాయ బోధనా శాలయందు నీ
క్రిందివిశేషముగ బోధింపఁబడుచుండెను ॥

" దేవపాయే విభూతేన బాహునాసుదర్శనేవ ప్రయతమాన వో
లోక సృష్టింవితన్వతి, బ్రాహ్మణాస్తద్వహన్తి. అగ్నినావైతస్తం
ద్విభుజేధారయన్ ॥ శతపథ బ్రాహ్మణము-
చక్రమాదాయాగ్నౌ ప్రతప్య బ్రాహ్మణస్య దక్షిణేబాహౌ
ధారయేత్ ॥ యఃపాఞ్చజన్యమాదాయాగ్నౌ ప్రతప్యబ్రా
హ్మణస్యోత్తర బాహౌ ధారయేత్ ॥ అథర్వణవేదము బృహ
దారణ్యము మొదలగు వానియందు చెప్పినప్రోప్పున, చక్రధారణము
ను, " ధృత్వోర్ధ్వపుండ్రం పరమేశితారం, నారాయణం సాంఖ్యయో
గాధిగమ్యం. జ్ఞాత్వాదిముచ్యే తనరాస్సమస్తైస్సం సారపాశైరిహచై
వవిష్ణుం ॥ మహోపనిషదు నందును, అథర్వణ వేదమునందును, క
ఠోపనిషత్తు మొదలగు, శ్రుతిస్మృత్యాదులయందు, మార్కండేయ
పురాణముల యందును, వర్ణించిన విధిని, కేశవ, నారాయణ,
మాధవాది రెండునామములు, విష్ణులాంఛనములు గల ఊర్ధ్వపుం
డ్రములు ధరించినచివై, నిర్మలహృదయులై, " ఏకోవిష్ణుం మహ
ద్భూతం,, నదైవం కేశవాత్పరమ్,, సర్వంవిష్ణుమయంజగత్,, అ
ను వాక్యార్థములు, బాగుగా గ్రహించిన వారలై, జ్ఞప్తియందుంచు
కొని, పరమభాగవత శిఖామణులై.
మాటి మాటికి శ్రీమన్నారాయణా యను నామముచ్చారణ సేయు
చు, శఠగోపస్తవము, శ్రీగుణరత్నకోశము, ముకుందమాల, అష్టశ్లో

కి, పరమశ్లోకి, ఆళవందారు స్తోత్రము, తిరువాయిముడి, తిరుమంత్ర ద్వయచరమ శ్లోకములు, నాలాయిరం మొదలగు, ద్రావిడ ప్రబంధ ముల యందును, తర్క-వ్యాకరణ, కావ్యనాటకా లంకారనిపుణులై, వేదాంతార్థములు, ఉపన్యసింపుచుండు, వైష్ణవోత్తములును, వారి శి ష్యబృందములును, విష్ణ్వాలయమునందు, నియమించిన పాఠశాలయం దు, సాంప్రదాయాను సారముగ, పఠించువారలై యుండిరి.

మరియు. శైవమతధర్మము లాపట్టణమందెటువలె నుండెననగా.

శ్రు ॥ సర్వలింగస్థాపయలిషాణిమంత్రం పవిత్రం ॥ ఈప్రకార ము లింగధారణకు వేదమునందు పెక్కు మంత్రములుగలవు.

శ్లో ॥ ముఖేమంత్రం హృదిధ్యానం, మస్తకేలింగధారణం, శిఖా సూత్రం తథాభస్మ ఏతద్బ్రాహ్మణలక్షణం ॥ అనుకీర్తిగా భస్మలేపనమును, రుద్రాక్ష మాలికా ధారణమును సేయుటముఖ్య ము. అట్టివారలు లింగైక్యమై, పుణ్యలోకమును జెందుదురు.

శైవ, వైష్ణవ, శాక్తేయ, సౌర, గాణాపత్య, కాపాలమతము లందిం టిలో శైవమతము, ఆదిమతము, అందుచే సర్వమంత్రములు, వేద ములు, పంచాక్షరియందున్నవి.

" తత్పరంబ్రహ్మేతి సయేకోరుద్రస్స ఈశస్యభగవాన్ । సమహే శ్వరస్సమహాదేవ "విశ్వేశ్వరాయ, మహాదేవాయ, అనుశ్రు తి యాధారమున సర్వదేవతల కాధారభూతుడగు సదాశివుడు.

జలంవా పుష్పమేకంవా । లింగస్యోపరి నిక్షిపేత్, అమంత్రం వా సమంత్రంవా కులకోటిం సముద్ధరేత్ । పూజయాభక్తిమ శ్నుయాత్ పూజాయా ముక్తిసంభవః ॥ పూజయాసదృశో ధ ర్మోనాస్తి లోకత్రయేప్వపి । హాన్యాత్కృద్ధో పిసాకాశం । స దృశం నాస్తియేద్విషం । త్యక్త్వా లింగార్చనం మూఢోము క్త్యర్థం త్రితయంతథా ॥ అను గరుడపురాణమందు చెప్పినచొ ప్పున, నీటిచేతను, పత్రపుష్పముల చేతను, మహాదేవుని పూజించిన

ముక్తిగలుగును - రజ్జువునందు సర్పభ్రమనుపొందినట్లు, సుక్తియందు రౌప్యభ్రమ పొందినట్లును, మహాదేవుని మాయచేత జగద్భ్రమ కలుగుచున్నది. శరీరమందు లింగమునుధరించియు; పరలింగైక్య సమరసానందము తెలియక, కాశికాదిక్షేత్రలింగ ధర్మాపేక్షితులై పోము వరు.

గీ ॥ కాయపోషణంబు గంగానదీస్నాన । మాదిగాగగల్గు సఖిలశౌచ । ములనుదేహ వాసనలు మూఢుడగువాడు । తగిలిసంచుచుండు ధర్మచరిత ॥ (శ్రీరామస్తవ)

శ్లో ॥ శివస్యాజ్ఞాబలాద్విష్ణు ర్జాయతే త్రిమయ్యపి చ । బ్రహ్మాస్సర్వజగత్కర్తా విరాట్సమ్రాట్స్వరాడపి ॥ అనునటుల సృష్టిస్థితిలయముల కాధారభూతుడు యీశ్వరుడు.

కాలాగ్ని రుద్రోపనిషత్తు, కూర్మపురాణము మొదలగు గ్రంథముల యందు చెప్పినరోప్పున భస్మరుద్రాక్ష ధారులై శ్రేష్ఠులో శివధ్యానము, శివపూజ చేయుచుండిన సర్వఫలములు, లభించి, అంత్యమున ముక్తికి జేరగలుగుదురు, పత్రములు, పుష్పములు, గరక, ఉదకము, మొదలగువానిచే, లింగపూజగావించి పిదప భుజింపవలయును.

"లింగంపూజ యితానిత్యం, మహతీం శ్రియమశ్నుతే,, అనియును,, చేతులారంగ శివుని పూజింపడేని,, అనువచనములు వృథాసేయక పూజింపవలయును.

సంపత్కరము, పాపహరము, నరకనివారకము, పరశివప్రాపకమునగు భస్మధారణము మరువకూడదు.

అనిబోధించు శైవమతు లొప్పియుండిరి.

సీ ॥ స్థానత్రయంబుల సంగత్రయంబుల బంధత్రయంబుల బారదోలి । జీవత్రయంబుల చిత్త్రత్రయంబుల బింబత్రయంబుల డిందుపరచి । దైవత్రయంబుల తాపత్రయంబుల యీషణత్రయముల దోషముడిపి । కర్మత్రయంబుల కారణత్రయముల

వాసనాత్రయముల వడిస్రోచి ॥

గీ ॥ యుండుపరమాత్మ గనువారలుర్విలోన । బాహ్యసంసారమె ల్లను బయలుజేసి । ముక్తికాంతను వదిలోన ముగ్ధనొందుగా । రనుచుశిష్యులకు బోధించునట్టిరాగా ॥ (శ్రీరామస్తవం.)

క ॥ మాయయను జోడుగొడుగుక । గాయంబను రథమునెక్కి కర్మనువింట । న్నేయంగ నాశా బాణో । పాయంబున జి త్తరాజు పడుమదిచేరక ॥ (శ్రీరామస్తవం.)

వేదాంత శాస్త్రంబుల నిరామయ నిరాభాస - నిర్వికల్ప - నిష్ప్రపంచంబైన - సనాతన బ్రహ్మచిదంశంబున, రజ్జుశుక్తి - స్థాణువులు లేని యహిరజత చోరాద్యారోపణ లెట్లుతోచిన - మాయప్రపంచంబు - దబ్బరగుటంజేసి - సంవిన్మాత్రుండై జీవుండు తన్ను దాంటె లిసిన ముక్తుండగు - మాయానుమిశ్రభవంబున తన్నెఱుంగమిం జేసి బద్ధుండగు. నీబంధముక్తులు నాత్మకు వేఱు సంకల్పస్వభావంబనువారును యాత్మసాక్షాత్కారపరుండైన కారణగురుండు శక్తిని పాతసమయంబున దోంచుననువారును, కర్మముక్తులు మహాసంకల్ప భోగంబులంగల దనువారును, సద్భక్తినిఁగాని యీశ్వరానుగ్రహ జ్ఞానంబులు లేవనువారును, భావాద్వైత, క్రియాద్వైత, ద్రవ్యాద్వైత, శుద్ధాద్వైత, మహాద్వైతులును, - రెయొప్పినయుండెను,

సీ ॥ వేదాంతవిదులైన విద్వత్సమూహంబు నుభయభాష కవిత్వ మొప్పుకవులు । సకలాస్త్రబాంధవ సంబంధవర్యులు వింజామరలువీచు వేత్రభటులు - నీతికోవిదులైన నెరమంత్రివర్గంబు రణరంగశూరులౌ రాజభటులు । సంగీతసాహిత్య ఛందస్సునాదిగ షడ్శాస్త్రపూర్ణులౌ శాస్త్రవిదులు ॥ గీ ॥ వందిమాగధపరిజన బృందములను । బలసికొలచెడి నతులవైభవముగలుగు । చావడియునిడి రేకాంతస్థలమునందు । కులగురునితోడ నిట్లుల బలుకదొడగె ॥

గీ ॥ కాముకులును లేకయుండిన కామువమొకటి । హృదయసీమను
తాపంబు గదసియాడ । తాపసోత్తమ నేనెటు తాళగలను ।
రాజ్యమేలను ధనమేల రమణులేల ॥

వ ॥ అని పలికినంతనె వసిష్ఠమహామునీంద్రుడు చిఱునగవు నగుచు మహారాజా! త్రిలోకాధిపతిని పరిహసించందగు వైభవోపేతుడవై సకలసంపదల నొప్పియుండు నీకీచింతయేల తఱుణవయస్సున కామాది భోగముల ననుభవించి పిదపగదా నీవంశీయులు సంతతికై యోచింతురు అద్దానిసవిడది నీవు రాజ్యసుఖంబులు ననుభవింపుము అనిపలుక త్రిశంకుండు ముకుళితహస్తుండై ఇట్లనియెను. గురువర్యా రాజ్యాంతే నరకం ధ్రువంబనియుండుట మీర లెఱుంగనిది కాదు.

రాజ్యసన్నాహములు జంత్రపు ప్రతిమలవలె ప్రకాశించునవి యేగదా. సార్వకాలము రాజ్యభారమునందే కాలము గడుపుచుండిన యెడ నేను తరించుమార్గమును గనుగొనుటెప్పుడు, మాయాప్రపంచమున, సంసారంబను తగులంబునబడి, కామ మోహాదులకు లోనై మెలఁగుచుండుట సమంజసమగునే! మాపూర్వులవృత్తాంతము కొంత తమవలన వినియుంటిని. అయ్యది మఱపు జెందితినని యెంచితిరి కాబోలు?

సీ ॥ వాంఛితమీడేర పరిపూర్ణబోధను గావించపుడమి నీకరు
ణవలన । యశము గైకొనియుండు యఱుణమహారాజువంశ
మునందున వాసిగనగ । యజ్ఞయాగాదులందధిపుడై వరసత్య
వ్రతునకు సుతుండనై వరలుచుండ । కృపతోడ సలపైన కీర్తి
నివంశంబు పెంపొందగా చేయు ప్రేమవీడి ॥ గీ ధనము రాజ్య
ము తనువులు తరుణులెల్ల । సౌఖ్యమని బల్కుచుంటిరి సం
యమీంద్ర । నీకు లెట్టులదోచెనో నెరుగజాల । తాపసులకిట్టి
కఠినంబు దగునజెప్పుడి ॥

గీ ॥ భవ్యచరితుడ సాకేతపట్టణంబు । పరమసాధ్వీశి యనునట్టి
పట్టమహిషి । సద్గుణంబుల పతిచర్యనలుపగొంటి । గానశ్రా

శ్వతసద్గతి గలుగునెట్లు ॥

వ ॥ ధనము తనువు రాజ్యము శాశ్వతమగు పదార్థములు గావని నిశ్చయించుకొనవలయును.

శ్లో ॥ కామక్రోధాశ్చ లోభంచ దేహేతిష్ఠంతి తస్కరాః । జ్ఞానరత్నాప హారాయ తస్మాజ్జాగ్రహి జాగృహి ॥ అనియును.

శ్లో ॥ అర్థానా మార్జనేదుఃఖ । మార్జితానాంచ రక్షణే । నాశే దుఃఖంవ్యయే దుఃఖ । మర్థ స్త్రైవకుతస్సుఖం ॥ మరియు ధిగర్థం దుఃఖభాజనం బనియున్నది.

సీ ॥ కామక్రోధాదిమహా ఘోర శత్రువర్గ ప్రతాప ప్రధానసా ధనము ధనము । సకలావగుణపుంజ సంశ్రయాశాపాశ కారణాగళ బంధనముధనము । జన్మపరంపర సంసార కారణ ఘనకర్మజాల వర్ధనముధనము । కైవల్యసంప్రాప్తి కారణవైరాగ్య ధర్మమార్గావరోధ ధనముధనము ॥ తే ॥ గీ ॥ గలిగిగర్వంబు దొట్రి దుఃఖంబుమదికి । పెనచునజ్ఞాన పావకేం ధనముధనము । స్వప్నలబ్ధపదార్థంబు చందమునను । దలచిజూడంగ నట్టిదంధనముధనము ॥ —— అని పురూరవచక్రవర్తి మహార్షితో జెప్పినటువిని యుండమే. ఇంతేగాక క్రోధుండు లోభుండు మహామోహుండను, మువ్వురుసోదరుల వెంటనిడుకొని కామదేవుడు, మలయానిలయును, వసంతుడును చంద్రకళయగు పండువెన్నెలను పుష్పములు, స్త్రీలును, మొదలగు పరివారముతోగూడి ప్రపంచమును రాజ్యమునేలుచు, సత్యవంతులను, వివేకులను, తమమహిమకు లోబఱచుకొనును.

తక్కుంగల మద, మత్సరాదుల ప్రతాపము, వర్ణింపనలవి యెకాదుగద. మరణాంతమువరకు తృష్ణాలోభుల ప్రతాప మడుగంటదుగద. కాముని కృపాకటాక్ష ప్రసారముగల్గెనేని, నేర్చినవిద్య మఱచుట. కన్నులుండి, మంచివస్తు పరిజ్ఞాత గలుగకుండుట, జూడకుండుట, చెవు

లుండి, హరికథాశ్రవణమాది మంచిమాటలు వినలేకుండుట, గజతు
రగాది వాహనములు, రాజ్యము మొదలగు ధనము, వైభవము నెంత
యున్నను తృప్తి నొందకుండుట. అహంకార మమకారములను గంటిపో
కుండుట. గలుగనీయవలెగద. సుమతియు కన్నువిప్పగానే " కామా
తురాణాం న భయం న లజ్జా, యని సూక్తులు.
శిగ్గు, భీతి, లేక స్త్రీలోలత్వమున, తప్పు పనుల సంభవించును.
తెలియనగా, శ్రోత్రేంద్రియమునకు, విషయము శబ్దము, త్వగింద్రియ
మునకు స్పర్శము, ఘ్రాణేంద్రియమునకు గంధము, జిహ్వేంద్రియము
నకు రసము, చక్షురింద్రియమునకు రూపము, ఈ యైదింటి శ్రోత్రాదీ
న, సమష్టిరూపము చేతఁ, బుద్ధుని చిత్తము, నపహరించుటవలన, త
రుణి యనఁబడియెనుగద. అట్టి స్త్రీరూపములు,

శ్లో॥ నారీస్తనభర నాభీదేశం । దృష్ట్వా మాగా మోహావేశం । ఏ
తన్మాంస వసాదివికారం । మనసి విచింతయ వారంవారం ॥

అనియును.

క॥ చన్నులు మాంసపుముద్దలు । కన్నులు దాగ్జలము ఫుసులు గా
రెడుతొరటల్ । వెన్నులు యెముకలపాతర । లన్నులునివి తెల
సివలచుట వివేకమొకా ॥ అని పురూరవుఁడు వచింపలేదా ।

శ్లో॥ కురంగమాతంగ పతంగభృంగ । మీనాహతాః పంచభిరేవ
పంచ ॥

చ॥ వనకరి జిక్కె మైనసకు । వాచవికిన్ జెడిపోయె మీను, తా ।
వినకరి జిక్కె చిల్వ, కను వేమర జెందె మిడుత్తు తావిలో । ముని
గి నశించె తేటి, తరమా యిరుమూటిని గెల్వ నైమనసా । ధనము
లు గెల్వ నీ వెకద । దాశరథీ కరుణాపయోనిధీ ॥

శబ్దము చేత చాతకపక్షి మేఘధ్వని విని, జలపానము చేయుటకు పై
కిపోవునెడల, భూమియందవి శబ్దము విని, మేఘధ్వని యనుకొని వలచే
క్రిందఁబడిచచ్చును.

స్పర్శనుచేత కిరాతకుఁడు పల్లముత్రొవ్వి దానిమీఁదవచ్చికను వై రుపెట్టి, దానియెదుట, ఆడఏనుఁగను గట్టినదాని స్పర్శము, నపేక్షించి, మొగఏనుఁగు, పల్లములోఁబడి చిక్కుబడును.

గంధముచేత భ్రమరముకొలను యందుగల, పద్మములోనుండెడు తేనెకాశించి, అందులోచేరి పద్మము, ముణింగిపోవునెడ, తానును ముణిఁగి, జలములోఁ బడిచచ్చును.

రసముచేత మీనము, జాలరుడువేసిన, గాలమునందలి, అల్పమాంసమున కపేక్షించి ఆగాలమునుమ్రింగి, మృతినొందును.

రూపముచేత మిడత, దీపమును, పండనిభ్రమించి, మ్రింగఁబోయి, అందులోఁబడిచచ్చును.

ఈప్రకారము, ఒక్కొక విషయమునందే, ఆయాజంతువులు, మృతినొందుచుండగా.

స్త్రీయందలి పలుకులకును, స్పర్శమునకును, గంధమునకును, రసమునకును, రూపమునకును, పురుషులువశపడి నశింపకుందురా.

మాంసము, వసకొవ్వు, రుధిరము మొదలగు, మలిన పదార్థములొప్పు, స్త్రీలయందసూయతజెందక, ఎన్నిదినములు, భోగించినను దృష్టియు సరియగుమార్గము నగుపడునే.

ఉ ॥ చక్కెర పూతబూసిన విషంబులుభామల వాక్యవైఖరుల్ ।
చక్కగ వెన్నమెత్తిన శిలల్ విరిబోఁడుల చిత్తముల్ మణుల్ ।
జెక్కిన సంకిలల్ సతుల చేష్టలు కొమ్మల నమ్మవచ్చునే । అ
క్కట మేకవన్నెపులు లంగన లెన్నిట నెంచి జూచి నన్ ॥

శ్లో ॥ ఔదుంబరాణి పుష్పాణి । శ్వేతవర్ణంచవాయసం । మత్స్యపాదం జలే పశ్యేత్ । ననారీ హృదయ స్థితం ॥

వ ॥ మేడిపువ్వును, తెల్లనికాకిని, జలమందు చేపయొక్క పాదమును గనుగొనుట గలిగిన గలుగవచ్చును. గాని స్త్రీల హృదయమును గనుగొన గలరే?

గీ ॥ మూత్రపతన స్థలంబు బవిత్రమనుచు । ద్రొక్కరానేల గని
రోసి దొలఁగుచుండు । రట్టి మూత్రపు కాలువ దైన దోని
యోని దానికి రోయ దీయుల్ల మనఘా ॥

వ ॥ రుధిరము, మలమూత్రములచే, నిండి లోనుండి వెడలుటయే
మేహ్యముగానగుపడు చుండెడిదియు, నైనవస్తువు నపేక్షిం
చి మోహమునఁ బడి మాయాలోలుండై చచ్చుచు, పుట్టు
చు, గర్భనరక మనుభవింపుచుండ వలసినదేగద మతిభ్రమ
చేత శాశ్వత సుఖదాయినిగ నున్నట్లు భావించుటయే గాని
కసవుకొన నున్న నీటి చుక్క చందమున సందేహాస్పదముగ
లదియే గదా దేహము నీటిబుగ్గ సంపదలు మెరుపులు సుఖ
మణు మాత్రము దుఃఖము పర్వతము నిత్యము మృత్యుప్రే
రితమై కాలచక్రము ఉశ్వాస నిశ్వాసల చేత క్షయించుచుం
డు ఆయువు అపార తరంగములు గలసంసార సాగరము ష
డ్రసోపేతములగు పంచభక్ష్య పరమాన్నములు జిహ్వాచా
పల్యమున కనువగు, రుచులు హంసతూలికాతల్పములు, ర
త్నభూషణములు - రుద్రాక్ష తులసీసరులు - కస్తూరీ తిల
కము చందనము భస్మోర్ధ్వపుండ్రములు అధికార గౌరవము
మొదలగునవి - ఇంద్రియాదుల యొక్క అలంకారమున క
నువగు చిత్తవైకల్యములేగద ఇవి యవి యననేలా - పోనిం
డు. అశాశ్వత మగు వానిలోనైనను సంతోషదాయకము
గా నుండవలదా ? మనుష్యులకు మనస్సే బంధమోక్షము
లకు కారణమై శబ్ద స్పర్శాది విషయములయందు అశక్తము
లకు ముఖ్య కారణముగద కార్య కరణ సంఘాతాత్మకము
లైన జీవులు జన్మించుటకు పూర్వము అదృశ్యులుగాను జ
న్మాంతరమువిడిచినది మొదలు పుట్టిమరణ మయ్యెడిపర్యం
తము - నడుమ నుండెడి మధ్యకాలమునందు - దృశ్యులుగా

ను - మథనానంతరము - తిరిగి అదృశ్యులుగానగు చున్నార
ని పురాణ ప్రసిద్ధముగద భూలోక భువర్లోక సువర్లోక సుల
నివాసులు - అమృత పానముజేసిన వారైనను - ఉదకముల
చే పూర్ణముగా నిండియుండుసముద్రములును, దేవతలేగాక
రాక్షసులును, ధృవుఁడును, నక్షత్రములును, హరిహరబ్ర
హ్మాదులును, కాలము ప్రాప్తించినప్పుడు, నశించెడివనుట
దృఢమైనను, యేవిధమైనకొంతలేక, నశింపుకాలమాసన్న
మగువఱకు, విషయానందమగ్నులై యుందురుగద!

అట్టివి నాకులేక గొప్పకొంతగలిగియుంటినిగద. ధనము, రా
జ్యము, శృంగారసౌధములు, హంసతూలికాతల్పములు, హయగజాం
దోళికములు, దాసదాసీజనబంధు మిత్రమాత్యవర్గములు గలిగి
వానికన్నిటికి వన్నెబెట్టుసంతానమను, కొలికిపూసలేక, మొగమున
కుముక్కును, ఆకసమున రోహిణీకాంతుఁడు లేనిరాత్రి, పతిలేనిస్త్రీ,
పుడమీశుఁడులేనిరాజ్యము, వన్నెకెక్కని కావ్యము, నెంత ప్రకా
శహీనమైయుండునో యారీతి భాసిల్లుచుండెనుగద మూఁడుగాళ్లముస
లియగువిధాత ముదిమిచే మదితప్పి వ్యత్యస్తకార్యములు పెక్కులు,
యెల్లప్పుడు జేయుచుండుననుట దృఢపడెను. ఎటులనగా, నవమోహ
నాకారుఁడగు పురుషునకు గురూపిని భార్యగాఁజేసి దంపతులలోకల
తపెట్టుచుండును. జవ్వనియు సురూపియు గుణవతియు నగుస్త్రీకి కడు
వృద్ధుని భర్తగాఁజేసి యవ్వనలక్ష్మిని భంగపరచును. ఇల్లిల్లుదిరుగు
చు వ్యభిచరించువానికి, పరమపతివ్రతాశిరోమణిని సతిగాసమకూ
ర్చును. శాంతస్వభావునకు గయ్యాళిగంపను గట్టిబెట్టును. లోభికి ధన
మిచ్చును. దాననిరతుఁడగువానికి ధనమీయకుండును. భగవద్గుణాను
రతులు, బ్రహ్మనిష్ఠాగరిష్ఠులకుదారిద్ర్యము- పెక్కుసంతతి నొసఁగును.

ఉ॥ అన్నముగల్గువారికి దయామతి సంతతినీయనోపడా । పన్న
తనొందినట్టి తినబట్టయు నన్నము లేనివారి క । భ్యున్నతరీతి

సంతతిమహోన్నత సంఖ్యనొసంగు వద్దువద్దన్నను పాడు
దైవము హాహా! యతడెంతటి కొంటెవాడకో ॥(వా॥ వి॥)

నేనెంత విలపించి దూరినను ప్రయోజనమగుపడదు. ఒకానొకప్పుడు,

శ్లో॥ వృక్షేకంచ సమారూఢ। నానాజాతి విహంగమాః। ప్రాత
ర్దశదిశోయాంతి కాతత్ర పరివేదనా ॥

అను నటుల యెక్కడివారలక్కడికి పోవుచుందురనుట నిక్కవమేగాని క్షణముసేపైనను గలసి మెలసి సుఖులై సంతోషమును పొందుదుముగద! ఇంతేగాక,

చ॥ కొడుకులుగల్గుదాక నొకకొన్ని దినంబులు చింతనందనుల్।
వడమిన నాయువుంబలము విద్యయు బుద్ధియు చాలగల్గుగా
నుడుగనిచింతగల్గి తనునోపి భజింపని చింత తండ్రికెప్పుడు।
కడుచింతసేయుదురు పుత్రులు శత్రులుగాక మిత్రులే॥

కంటబడిన దేవతలకు మ్రొక్కి సంతానముగని వారలకు విద్యాబుద్ధులు గలుగవలయుననియు, సకలగుణములనొప్పి తనయాజ్ఞానుబద్ధులై మెలంగవలయుననియును, చింతనుండును. ఇవియన్ని నొప్పియుండినను తనహితవున మెలగని వాడైనయెడ ఆమరణాంతముతీరనిశోకము గలిగియుండుననుట నిక్కవమేయైనను, ధరణీపాలనము సేయుచుండు నేను జాతము- నామకరణము- అక్షరాభ్యాసము- చౌలోపనయనము- వివాహము- మొదలగు శుభకార్యములనునవి మురిపంబు పెంపున నింపుగలుగు బిడ్డలకల్లారుముద్దుగా సలుపుటకునోచనైతినిగద! సంతానమో సంతానమని పేరాసలచే కలవరించుచు నేనెన్నియోనోములు సలుపుచు సకలదేవతలకెల్ల మ్రొక్కుచు- గ్రహశాంతులు- దానధర్మములు- నవగ్రహజపంబులకు ధనము కొల్లబెట్టుచు- ఫలంబుగానక - సంతాపించుచుండ వలసివచ్చెనుగద.

సీ॥ తనయునిమొత్తని నునుమేనుహత్తంగ వలవదే దేహంబుగల ఫ
లంబు। చిరునవ్వువెన్నెల జిలుగుమోముగనంగ వలవదేగ

న్నులుగలఫలంబు । అలరారురేత చెక్కిలిగిల్లిముద్దిడ వలవదే పెద వులు గలఫలంబు । అత్తత్తయనుమాట లాడనాకర్ణింప వలవదే కర్ణముల్గలఫలంబు ॥ తే ॥ గీ ॥ ఉల్లములరించి మురిపించు నల్లరిపను। లెల్లపచరించు పిల్లల యింపుగాంచి । సుఖమనుభవింప వలవదా సుగుణగణ్యా । కవితిజనమాన్య నరజన్మ గలఫలంబు ॥

మ ॥ కొడుకుంబల్కులు ముద్దులొల్కుపనులన్ గూర్మిన్వినోదంబిం
చుపెం । పుదలిర్పశరీర మక్కునను సమ్మోదంబుసంధిల్లజే।
సిదయాప్రేమలు సంఘటిల్లకుతుకశ్రీ నొందగారాలపం ।
తుదగన్నెన్నగుజన్మ జన్మనిదలంతుం దక్కుజన్మల్వృథా ॥వా॥వి

ఇవి యన్నియుగాక, ముఖ్యముగ గమనింపవలసిన విధాయకము లగునవి - నాతదనంతరము ధరణీపాలనము సేయుట - నేను యమ పురనివాసిని గాకయుండుట - యనునీరెంటిని బాగుగ - ఆగతానాగతము లెఱింగిన మీరుబాగుగ యోజింపవలయునుగద.

ఉ ॥ దేశములందుకోసలయు దేవతలందున దత్తమూర్తియున్ ।
శ్రీశునిభక్తిజ్ఞానమను చింతనలందున నంబరీషుడున్ । పాశము
లందునాగమును భామినులందనసూయసాధ్వియున్ । యీ
శలుదీరసూనులున నంగనుమీరలె ఉంగకుంటిరే ॥

క ॥ కులశీలమ్ములు నిలచెడి । దలపునుజనియింప నేను తనయులకొ
ఱకై । పలువిధ వెతలనుజెందిన చలనముబాహుంగదయ్య సం
యమివర్యా ॥

క ॥ పుడమీశుఁడు సత్యవ్రతు । డిడెరాజ్యము పుత్రునకు నేనావి
ధినే । కొడుకునకొసగగ వలయును । తడబాటునుబాయదె
లుపు తాపసవర్యా ॥

ఈకారణము మీకుసమంజసమగునా కాదా?

భవదీయ కృపాకటాక్షమున ఇక్ష్వాకువంశీయులు పాలనసేయు రాజ్యమునకు నెవని పట్టభద్రునిసేయ దలంపుగలదో నుడివిన - నగభాగము దుఃఖోపశమనము కాగలదు.

తక్కిన సగభాగము " పుత్రేణలోకాన్ జయతి, అపుత్రస్య గతిర్నా స్తి పున్నామ్నో నరకాత్రాయత ఇతి పుత్రః, పున్నామ్నో నరకాద్య స్మాత్పితరం త్రాయతే స్వయం - తస్మాత్పుత్ర ఇతి ప్రోక్తస్స్వయమేవ స్వయంభువః ॥ అను శ్రుతులను, స్మృతులను పాటింపవలదా.

మ ॥ విపరీతప్రతి భాషలేమిటికి సుర్వీనాథ యీపుత్రగా । త్రపరి ష్వంగ సుఖంబుఁ జేకొనుము ముక్తాహారకర్పూర సాం । ద్రప రాగప్రసరంబు చందనము చంద్రజ్యోత్స్నయున్ బుత్రగా । త్రపరిష్వంగము సత్పుజీవులకు హృద్యంబే కడుం శీతమే ॥ అని,

శ్లో ॥ కోటరాంతర్భవోవహ్ని స్తరుమేకం దహిష్యతి । కుపుత్రస్తు కులేజాతః స్వకులం నాశయేత్పరం ॥ అనునటుల పుట్టనిపు త్రులు తల్లిదండ్రులను దుఃఖపెట్టుట సత్యమేయైనను - నరక బాధను తొలఁగుటెటులనో దురూహంబు గానున్నది.

కావున వివేకశూన్యత, నరకము బాయు మార్గమూహించి చక్కఁగా వక్కాణింపుఁడు. అని ప్రార్థించెను.

—(వశిష్ఠ బోధ.)—

నాయనా? త్రిశంకమహారాజా ! నీవు చెప్పినటుల, ధన, రాజ్య భార్య పుత్రాదులెల్ల, అశాశ్వతములే - లోకములు, దేవతలు, నక్ష త్రములు, మొదలగునవియును, చలనములగునవియే.

అచలమగునది బ్రహ్మమొక్కటియే? విక్షేపశక్తివలనఁబుట్టిన స్థూల సూక్ష్మ దేహములతోడను - అంతరింద్రియ - జ్ఞానేంద్రియ - కర్మేం ద్రియముల తోడను కూడి - సకలపుణ్య కర్మములచేసి - చిత్తశుద్ధి గలిగి - సాధనచతుష్టయ సంపన్నుఁడై - వేదాంతశాస్త్ర శ్రవణ - మనననిధి ధ్యానములనుచేసి - బ్రహ్మజ్ఞానమును సంపాదించిన - బ్ర హ్మజ్ఞానమును ప్రబలించి - విక్షేపశక్తి దొడ్డదై - ఆవరణశక్తిని న ణచివైచును.

అట్టి నిర్గుణబ్రహ్మమే సత్యమై స్వయంప్రకాశమై గనుపట్టును.

నృత్తిప్రళయ - అవస్థాప్రళయ - దేహప్రళయ - మనుప్రళయ - బ్రహ్మప్రళయ - విష్ణుప్రళయ - రుద్రప్రళయ - మహేశ్వరప్రళయ - సదాశివప్రళయ - విరాట్పురుషాది ప్రళయములుగ తోచి సర్వం ప్రతిష్టితం । మయిసర్వంలయంయాతి । తద్బ్రహ్మాస్మ్యహమద్వయం ॥ అను శ్రుత్యర్థమును గుర్తెఱింగి- నిరతిశయానందము చెందగలుగును.

శ్లో ॥ ఇదంసత్య మిదంసత్యం ఇదంసత్యం నసంశయః ॥ ఇదిము మ్మాటికి నిస్సందేహముగ సత్యము.

అవస్థలు యేడింటిలో ॥ అజ్ఞాన, ఆవరణ, విక్షేపములు - మూడును బంధహేతువులగును.

పరోక్షము - బంధప్రాప్తికిని - మోక్షప్రాప్తికిని కారణమగును.

అపరోక్షము - అనర్థనివృత్తియు - ఆనందావాప్తియు - అనెడు మూండవస్థలు - మోక్షప్రాప్తికే హేతువులగును.

ఈయేడవస్థలును - ఆరోపితమయిన - అహంకారమునకేకాని అహం కారసాక్షిని - నిర్వికారుండును - నగు పరబ్రహ్మకు లేవు.

ఈభావమే వేదాంతరహస్యమగు పూర్ణబోధ.

సుజ్ఞానబీజమునకు వృక్షమయి ఫలముగా - గ్రోలందగు ఫలరసము. అని బాగుగా నెఱుంగవలయును. బ్రహ్మవేత్తలకు మయిత్రి - ముదిత కరుణ - ఉపేక్షయను నాలుగు సద్గుణములుండవలయును.

పెద్దలయందు విశ్వాసముగానడచుట, మైత్రి. సత్కర్మాను ష్ఠానములు జేయువారియందు, బ్రహ్మజ్ఞానమునకు వచ్చెదరని సం తోషించుట, ముదిత. జ్ఞానములేక సత్కర్మానుష్ఠానమును జేయక, పాపకృత్యములనలుపక, యుండెడి పామరులనుజూచి చెడిపోవుచున్నా రని వ్యాకులతజెందుట కరుణ. ఈమువ్వురియందును సమానదృష్టిని ఊఁఆకయుండుట, ఉపేక్ష. అను సద్గుణములుగలిగి మాత్సర్యము స్పర్ధ, అసూయ, నింద, యనునాలుగు దుష్టగుణములులేక యుండవ వలయును.

పరబ్రహ్మ యెట్టివాఁడనగా, భ్రూమధ్యము మొదలుకొని, పంఁడ్రెండంగుళములకు సహస్రారకమలము యెనిమిది భాగములై, ఒక్కొక్క భాగమునకు నూటయిరువదిరెండు దళముల నొప్పిన నుండును. దానినడుమ హకారబిందు సకారములతోఁ గూడిన హంసమను పేరు గలిగియుండును. ఆబిందువే సంకల్పరూపమయిన అంతఃకరణము ॥ హంసోపనిషత్తు యందున నిట్లుచెప్పెను.

" పూర్వదళే పుణ్యమతిః । ఆగ్నేయానిద్రాలస్యం । యామ్యే క్రౌర్యేమనీషా నైఋత్యాంపాపేబుద్ధిః । వారుణ్యాం క్రీడా । వాయవ్యేగమనాదౌ కౌబేర్యాంరతిప్రీతిః । ఈశాన్యే ద్రవ్యదానం మధ్యే వైరాగ్యం । కేసరేజాగ్రత । కర్ణికాయాం స్వప్నంలింగేసుషుప్తిః, పద్మత్యాగే తుర్యం,

ఈసంకల్పమాత్ర పురుషుఁడైన బ్రహ్మ - భూమి మొదలగు నా భూతములలోఁ జేరక - ఆకాశస్వరూప మాత్రుఁడైయుండును - సంకల్పరూపుఁడు బ్రహ్మయనునట్లుగా - మనస్సుచేతను దోఁచుచుండుగద.

అట్టి లోకమంతయు మనోవికారము.

రూపనామముల తోఁగూడిన పదార్థములయందుఁ దెలిసికొనుటకు మాత్రము అయినదేహములు - యేమనస్సువలన గోచరించుచున్నవో అగోచరించెడి స్వరూపములను చిత్తమని దెలిసికొనుము. వెలుపల ద్రవ్యముగాఁ దోఁచునది యేదియో నా ద్రవ్యమే మానసమని- వేదాంతములయందు వచియింపబడుచున్నది. ఆలోచినదివినాగా మనస్సనే నామముకలది వేఱొండులేదు. ఆలోచిన వృత్తినే మానసమని తెలిసికొనుము. యేస్థలమందు వృత్తి దోఁచుచున్నదో ఆప్రదేశమందే మనస్సుండునని తెలిసికొనుము. ...

సీ॥ మనసయా సంసార మాయావికారము ల్మనసయాలౌకిక
మహిమలన్ని । మనసయా పాపంబు మనసయా పుణ్యంబు మనస
యాలోకాదిమత్సరములు । మనసయా జీవులు మనసయా జనములు

మనసయాసుఖదుఃఖమలినములును । మనసయాస్త్రీలును మనసయా
పురుషులు మనసయాయఖిలాశ్రమంబులెల్ల ॥ గీ ॥ మనసుగాకున్న దొ
కసైన మాయ లేదు । మాయగాకున్న దొకసైనమనసు లేదు । యఖిల
జగము మనోమాయలగుట దెలిసి । బ్రదుకనేర్చినవారలు బ్రహ్మవిదులు ॥

అఖండమయి, ఆద్యంతరహితమై, అపరిమేయమయి, అవా
ఙ్మానసగోచరమై, సచ్చిదానందమయి, స్వయంప్రకాశమయి, అపరి
చ్ఛిన్నమయి, అనావృతమయి, అనేకరూపమయి, నిత్యమై, నిర్మలమ
యి, నామరూపక్రియాతీతమయి, నానారూపమయి, సర్వవ్యాపక
మయి, సర్వాంతర్యామియయి, వెలుగునదియే, పరబ్రహ్మము.

ఆపరబ్రహ్మము, మూలప్రకృతియని, అవ్యక్తమని. వ్యవహ
రింపఁబడు మాయాశక్తియొకటితోఁచును. ప్రళయకాలమున సూర్య
చంద్రులు సృజింపఁబడుటకుముందు దట్టముగా నెల్లెడల నావరించుకొ
నిన గాఢాంధకారమునే మాయయనఁబడును. అట్టి, ప్రధానపురుషుని
యందు కాలప్రవృత్తి సమసినవేళయందు, నొకశబ్దముపుట్టెను. అందున
నాకాశతత్త్వము శబ్దానికి వాయువు, స్పర్శానికి రూపము, తన్మాత్రగుణం
బయ్యె. ఆరూపమున వహ్నితత్త్వము, దానికి, రసంబు తన్మాత్రగుణం
బయ్యె. ఆరసగుణంబు వలన, నుదకతత్త్వంబుపుట్టె. ఆయుదకంబున,
గంధంబు తన్మాత్రగుణంబయ్యె. ఆగంధంబువలన, భూమితత్త్వంబు బు
ట్టెను. ఆభూమికి శబ్దాదులేనును తన్మాత్రగుణంబులయ్యె. అట్టి పృథి
వ్యప్తేజోవాయ్వాకాశంబులను భూతపంచకంబును, శబ్దస్పర్శరూపరస
గంధంబులను, గుణపంచకంబును, త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబుల
ను, బుద్ధీంద్రియపంచకంబును, వాక్పాణిపాదపాయూపస్థలను కర్మేం
ద్రియపంచకంబును, మనోబుద్ధ్యహంకారంబులతోడ, రాజసతామస
సాత్త్విక గుణోద్రిక్తంబుగా ప్రజాసృష్టినివిస్తరిల్లె.

మ ॥ పరమాత్ముండును పంచభూతమయుఁడున్ బ్రహ్మాణ్యుఁడుం
దానన్దై। హరినారాయణమూర్తితాననుపమంబై యొప్పియుం

క్షోణిపై! సురగాక్షీర్వరతల్పాంత్రమెుజని తానున్న వృందాత్మయు
మూ। త్రిరజోవృత్తి వహింపమానసమునన్ దీపించె సృష్టి
యల్ ॥ మఱియు,

సు॥ ఆపాంబై జలబుద్బుదప్రతిమమై యంభోధిలో నొక్కయం।
డమును జనింపఁజేసి క్రమక్రమంబున నిరూఢి ధ్వాంతమధ్యంబునన్।
సుమహాత్వంబుననుండె దానివెలినస్తోకంబులై వారిన। హ్మ
ముఖ్యోఘ్నుకదంబులావృతములై వే పారెగాఢంబుగన్ ॥

అట్టియండంబులో పల సాత్త్విక, రాజస, తామసములనెడి మూడుగుణంబులు బుట్టెను. సాత్త్విక మాయననుసరించి విష్ణుమూర్తియు రాజసమాయననుసరించి చతుర్ముఖుఁడును, తామసమాయననుసరించి రుద్రమూర్తియు, ప్రపంచమును గలుగఁజేసి, యోగిహృదయముల నారయుచు సాక్షిభూతులై సృష్టిస్థితిలయములను మూడుకార్యముల ను మాత్రము వహించి చేయుచుందురు.

సూర్యచంద్రులు గాలివలన, నీటికదలికవలన, నొకచోటినుండి మరియొకచోటికిపోవునట్టుల, జీవుఁడును తనత్రికరణములచేత, చేయ బడిన పుణ్యకర్మ, పాపకర్మ మిశ్రకర్మములవలనఁ గలిగిన మనుష్యాది శరీరములనుండి యితరశరీరములయందు ఆకర్షణఁ బ్రవేశించుచుండును.

శ్లో॥ కర్మణాంపరిణామత్వా దావిరించ్యాదమంగళమ్। అవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభమ్॥" అనుప్రమాణముచేత సృష్టికర్తయైన, బ్రహ్మ సహితము. కర్మఫలము ననుభవించెను.

శ్లో॥ సూర్యోగ్ని ర్బ్రాహ్మణో గావో వైష్ణవః ఖమ్ మరుజ్జలమ్। భూరాత్మా సర్వభూతాని భద్రపూజా పదానిమే॥" అనియున్నది. గావున, సర్వభూతాంతరాత్మయగు, భగవంతునిగా భావించి, ధర్మము గోబ్రాహ్మణ సంరక్షణ యజ్ఞములు వ్రతములు దీక్షలు వేదములు భూతములు సత్యము తపస్సు గుణవు గురువు చేనుపదేశింపం

పున్నామనరక నివృత్తినని చెప్పుట యజ్ఞానము, యసత్యము, యని న మ్మెదము. పూర్వజన్మములయందు చేసిన, పుణ్యపాపమిశ్రకర్మలవల్లనైన ఫలమునకు అనుకూలముగానే మనస్సు వినుట, స్పృశించుట, చూచుట, చవిచూచుట, ఆఘ్రాణించుట మొదలయిన చాంచల్యములుగలిగియుండును. పూర్వజన్మార్జితసుకృతవిశేషమువలన, గలుగు ప్రారబ్ధ కర్మఫలానుభవమెటువంటివారినిగాని విడువదు. ఈశ్వరకటాక్షమును పెద్దల యాశీర్వాదమును సుజ్ఞానమును సంపాదించుకొన్న సజ్జనులవిషయమున మాత్రమంతగా కర్మమునకధికారము చెల్లదు.

కాబట్టి, దానికార్యమగుదుఃఖమొక పర్వతము మాదిరిగవచ్చినను, తుదకు పరమాణువుగాఁ బరిణమించితనంతటనే విరిగిపోవును. ఏయేకాలముల నేయేసుఖదుఃఖముల ననుభవింప వలసియుండునో ఆయాసుఖదుఃఖములననుభవించినఁగానితీఱదు.

దుర్విలంఘ్యమగు విధిప్రతికూలమైనసమయమందు సులభముగా దుఃఖనివృత్తియగుటకు, సాధుసేవయొక్కటియే ప్రధానసాధనమని, త్రిమూర్తులచే బోధింపఁబడెను. ఇంతకు పూర్వము మావంశీయులలోఁ మాంధాతమహారాజు చిరకాలము నీవలెనే తనకుఁదనయులు లేనందు నఁజింతించుచుండి తపము సేయుచుండెను.

ఆసమయమున నారద మహర్షి మాగృహమునకువిచ్చేసి, రాజుభార్యచే మాఁనుభక్ష్యములు గ్రహించి ముగ్గురుపుత్రులుగలుగుదురని యాశీర్వదించి పోయెను. ఆశీర్వచనమువలన ముగ్గురుకొడుకులు పుట్టిజగత్ప్రసిద్ధులైరి నీవును సాధు సత్తముల నిత్యమును పూజింపుచున్నపక్షమున సర్వార్థములు నీకు సులభముగా సిద్ధించుననుటకు సందేహము లేదు. నీవు న్యాయమార్గమున రాజ్యపాలనము జేసి ధనము నార్జించుచు, ఆర్జించిన ధనము సత్పాత్రముల యందు వినియోగపఱచుచు నీవనుభవించుచు సత్పురుషులతో సహవాసము జేయుచు శాస్త్రపరిశ్రమగల సత్ప్రవర్తకుడవై యుంటివి. నీపరిపాలన

వలన నేఁటికాలపు రాజ్యములయందును విశ్వాసహీనులు లోభగుణ విశిష్టులు ద్రోహాన్వేషణపరులు పరద్రవ్యముల నపహరించువారు పరులను మోసపుచ్చువారు పితృగురు జనములకు ద్రోహ మొనర్చువారు పరదారల నభిలషించువారు పాప కర్మాచరణమునకు ప్రముఖులై కల్లలాడువారు అధిక ప్రసంగములు చేయుచు హరి భక్తులయందు ద్వేషముగలవారు శుష్కవేదాంతము లుపన్యసించు వారు వేదశాస్త్రముల నిందించువారు సాధువాక్యముల నుపేక్షించు వారు భూతదయా దాక్షిణ్యములు లేనివారు దురహంకారము గలవారు మొదలగు ప్రవర్తకులు లేరు.

యోగులకు బలము మౌనము. మహాత్ములకు బలము జ్ఞానము బ్రాహ్మణులకు బలము వేదము. పక్షులకు బలము రెక్కలు. మానవులకు బలమన్నము. పురుషులకు బలము ధనము. దుర్బలులకు బలము రాజు. యోధులకు బలము ధైర్యము. స్త్రీలకు బలము సుశీలత. గృహస్థులకు బలము గృహిణి. అని చెప్పినటుల నీయేలుబడిలో నివియెల్లను సమృద్ధిగా వృద్ధిఁబొందుచున్నవి. గాని లోపములు లేకపోవుటయే గాక.—— సీ॥ బ్రహ్మంబు నేనని పలుమారు ననవచ్చు బ్రహ్మబోధమె యుంగుభావమరుదు । వేదాంతశాస్త్రముల్విభజింపగావచ్చు నాత్మార్థము తెల్పుటదియరుదు । సర్వంబులునురోసి సన్యాసిననవచ్చు శూన్యమార్గంబులో జూచుటరుదు । అదిబంధమోక్షంబులనిజెప్పగావచ్చు దానుగానిలకడ దనరుటరుదు । తనువుసనర్థంబు గుణనిధి యనగవచ్చు । దానిమొనసిన లోభంబుదీఱుటరుదు । మనసు సామర్థ్యమెంతి గెడి మర్మమెఱుదు । అంతతానయ్యుగాకుండుటదియునరుదు ॥ ...

గీ॥ శుష్కవేదాంతసిద్ధాంతసూటిపరులు ఆత్మనెఱుంగక యర్థముల్వ్యర్థముగను । జెప్పుచుందురు లోకులజెఱచుకొఱకు । నిజము నిష్ఠూరమైకల్లనిజములాయె ॥ ...

గీ॥ సాంఖ్య తారక యోగసంజ్ఞల నెఱింగి । రాజశివయోగసం

యోగరామరాజ । ఖేచరీయుక్తసౌఖ్యలక్ష్మీరతుండు । వాదవేదాంత వేద విద్యాహితుండు ॥

సీ ॥ ఉత్తర శాంభవీ యుక్తుండు ముక్తుండు పరమ విద్యాధురంధరుండు గురుడు । తుర్యసుఖాస్వాద ధుర్యుండు నార్యుండు బ్రహ్మానుకూల సంభ్రముడు సముడు । నాదాంత విద్యావినోదుండు మోదుండు పురుషార్థ నటన సంభోగి యోగి । కూలంకషజ్ఞాన గూఢు డారూఢుండు దృగ్దృశ్యరాగ వర్జితుడు మితుడు । వేద వేదాంత సిద్ధాంత వేద్యుడాద్యు । డాత్మసుస్థిర చిత్సుఖా త్మాహిదేహి । నిర్వికల్ప సమాధి నిర్ణేతదాత । కారణాచార్య సేవాధికారి సూరి ॥

వ ॥ ఇట్టి వారలు నీచె పోషింప బడుచుండిరి. ఐహికాముష్మికములు సమభావము జేసి వర్తించుటయే సంసార మనబడును. అట్టిదానికి ధనము, సంతానము, సుగుణవతి, అనుకూలవతియగు భార్య సకల విద్యాపారంగత్వము, గల్గి యుండవలయును. నీకుసర్వసౌఖ్యములు మితిగల జ్ఞానము నొప్పియున్నది. మీపూర్వుల ధర్మకీర్తులు నిలుచు నటుల రాజ్యపాలనము సేయుచుంటివి. నీవు మూడుశంకలుగల్గి జన్మించుటచే సార్థక నామము వ్రాయ బడెను. ఇకముందట్టి శంకలు నివర్తి కాగలవు. ప్రకృతము నింతకన్న నధికముగ దెలుపుట దేద్దియును లేదు. సంశయముల మది నుంపకుము. నక్షత్రములలో చంద్రుడును, దేవతలలో నింద్రుడును, పక్షులలో గరుత్మంతుడును, తపస్సులలో విశ్వామిత్రుడును, మణులలో చింతామణియును, గజములలో నైరావతము, అశ్వములలో నుచ్చైశ్రవమును, మృగములలో కేసరియును, రాజులలో ఇక్ష్వాకును గౌరవింప బడుచుండిరి. అట్టి సూర్యవంశమందు జనించిన నీకు శాశ్వత గౌరవము లభింప గలదు. నీకు బ్రహ్మవిద్యా నిధానుడును, సత్య నిష్ఠాగరిష్ఠుడునగు, కొమారుడుదయించును. నీవుశాశ్వతానంద మనుభవింపగలవు. గావున చింతవీడుము. అట్టి సుపుత్రుడు గలుగుట కొకవ్రతము గలదు.

దానికధిపతి మూఁడుశిరములు ఆఱు బాహువులు శంఖు చక్రములు గద త్రిశూలము ఖడ్గము కమండలములధరించి సిద్ధ చారణ కిన్నరాదులచేఁ పూజింప బడుచు త్రిగుణాత్మకుండై అనసూయాత్రి కుమారుఁ డనం బరఁగు శ్రీదత్తాత్రేయమూర్తి యొప్పియున్నవాఁడు. అట్టి సచ్చరిత్రుని విధ్యుక్తముగా పూజించి ఆజ్యాహుతులచే తృప్తిని జేయ నీ వాంఛితము నెరవేర గలదు. ఆమహనీయుని జనన కారణము వినుము.

సీ॥ వరవజ్రగర్భిత వాసవమణిమయచారుకోటిస్తంభసంభృతంబు। మహనీయతరరత్న మణిసౌగరచితంబు బహురత్నకలశ విభ్రాజితంబు। లలితమందారమాలాజాలయుక్తంబు పృథుచతుశ్శాలాభివేష్టితంబు। మౌక్తికమాణిక్యమణిరాశిసహితంబు। హరిణ చామర దర్పణాన్వితంబు॥ తే॥ గీ॥ రత్నసూత్రగ్రథితహారి రత్నమకుర। సాలపల్లవతోరణజాలయుతము। రత్నసుస్తంభశోభితప్రాంగణంబు। ననుచు విలసిల్లునొక్కగృహంబునందు॥

సీ॥ ఒకవంక మణివితానోరుకుంభ సహస్ర మొకచెనరత్నపాత్రికలుకోటి। యొకయోరనభినవ వికసితసుమజాల మొకచాయభోగవస్తూత్కరంబు। నొక కేళి వగాంచనాంశుక సహస్రాయుత మొకమూలశ్రీగంధ యుక్తపాత్ర। లొకచోట మణిదండ వికచ చామరశతంబొక మెడమృదులతల్పకసహస్ర॥

తే॥ గీ॥ మొకటమణిమయపీఠికా యుతశతంబు। లొకటరత్ననిర్మితవేదికోత్కరంబు। గలిగి యతిరమ్యమై మహాజ్వాలనితాంత। మణిరుచులచేత నొప్పునమ్మందిరంబు॥

తే॥ గీ॥ ఎద్ది బ్రహ్మాండదుర్లభ మెద్దిరమ్య। మెద్దివాఙ్మనోగోచర మెద్దిసర్వ। కవులకనిరూపితం బెద్ది కనియువినియు నెఱుఁగ రట్టి వస్తువులచె వఱలుచుండు॥

అట్టి పరమాద్భుతంబైన యద్దివ్యసదనంబున, ధనుశ్శతపరిణామంబును వర్తులాకారంబును రత్నకింకిణీ పరివేష్టితంబును, విచిత్ర

రత్న పాంచాలికా సమూహా సహ్యమానంబును బుష్పితచిత్రకానన భూషితంబునైయొప్పు నొక్క రత్న దివ్యసింహాసనంబు తదుపరిభాగం బున సప్తతాళప్రమాణోత్సేధంబై సమంతతోవ్యాప్తంబై కోటిసూర్యసమప్రభంబై పరమాద్భుతంబై యతిదుర్నిరీక్ష్యంబై సర్వవ్యాపకంబై సర్వాగారణంబై చక్షుర్బోధకరంబై యొప్పు, పరమపదమునందు,

శ్రీ, భూ, నీళా, సమన్వితుండై అనంత, గరుడ, విష్వక్సేనాది నిత్యశూరులును బ్రహ్మరుద్రేంద్రాదులును పరివేష్టించియుండుతరి కలహాశనుండును పరమ భాగవతశిఖామణియునగు నారదమహర్షి.

సీ॥ తులసిరుద్రాక్షల మాలలుధరియించి యూర్ధ్వపుండ్రంబులునొప్పియుండ। భుజముపై తాంబురపొలుపొందు తాళముల్। శిరముపైజడయును మెఱయుచుండ। కాషాయవస్త్రంబు కాచబిగింపును గస్తంబుమీసంబు గదళియాడ। నిర్గుణపరమాత్మనిఖిలేశ కేశవా। నారాయణాచ్యుతసారసాక్ష॥

గీ॥ యజ్ఞరక్షకయజ్ఞేశయజ్ఞరూప। లోకనాయక మాధవా లోకవంద్య। శ్రీరమానాథ పరమాత్మ శేషశయన। పరమపదవాస మాం పాహిపాహిపాహి॥

అనుచువచ్చిశ్రీమన్నారాయణా! శంకరా! చతురాననా! మీ పాదపద్మములకు వందనములాచరించు చున్నాడనని వారలచేసన్నుతిం గొని యాసనముపై గూర్చుండెను. అంతనారాయణుండు నారదా! త్రిలోకసంచారివికావున, విశేషములేమైన గలవేనివక్కాణింపుమనెను.

నారదుండు ముకుళితహస్తుండై సృష్టిస్థితిలయాధికారులగు తమకుదెలియని విషయములుగలవే? ఐనను వేగనివినినది విశదీకరించెదను. సంపూర్ణదయతో సాకల్యముగ సావధానముగ నాకర్ణింపుడు. విశ్వకర్మచే నాకు కానుకగనొసంగబడియుండు, ఉక్కుశనగలు వచనము చేసిపెట్టుటకు, లక్ష్మి, సరస్వతి. పార్వతి శచి. లోపాముద్ర. అరుంధతీ మొదలగు పతివ్రతలను గోరితిని. వారివలన వచన

ము కానందమనని రాశి జెందక అత్రిమహామునిపత్నియగు యనసూయ కడకేగి యామెకు దెలిపితిని. ఆకలిగను గొని త్వటిలో పక్వము జేసి భుజించుటకనువుగ నిచ్చెను. అపరనుపతివ్రతామణీ కృపచే క్షుధ తీర్చుకొంటిని. ఆమెపాతివ్రత్య మహిమ కొనియాడ శేషునకైన నలవి కాదు. తక్కుంగల పతివ్రతల మనువారు నామమాత్రావశిష్టులే కాని, యాయనసూయకు సరిరారు. ఇంతకన్న విశేషమెద్దియు గనరాదు. అనివిస్మయించి త్రిమూర్తుల సెలవంది వెడలి పోయెను. అనంతరము సర్వజ్ఞుండగు నారాయణుండు యత్రియనసూయుల వాంఛిత మీడేర్చుటకు సమయము సమీపించినదని హృదయమున దలంచి బ్రహ్మసదాశివులార? నారదుని వాక్యముల వినియుంటిరిగదా శీఘ్రమున మామువ్వురము యనసూయ పతివ్రతా ప్రభావము పరీక్షించి రావలయునను తలంపు జనించినది కావున బోవుదము రెండు గాని వారియోగ్యముఖండయ్యెను. వారిఉప్పురము సమ్మతించిరి. తపస్వులు త్రిశంకునకు ఈప్రకారముగా నుపదేశించెనని సూతుండు శౌనకాది మహర్షులకు నుడివిన సంతోషభరితాంతరంగులైరి సహరి వృత్తాంతంబును దెలుపుచుటయు. ...

కం॥ వేదాంతతత్త్వనిశ్చయ। వాదాస్పద దేవదేవవసుదేవసుతా
నైవద్యవిరతగాత్ర। మోదక్రీడావినోదమురరిగానా॥ ...

కం॥ గోపాలవేషధారికి। గోపీజనపూర్వభాగ్యఘోషాశ్రయకున్
గోపక్రీడాస్వీకునకు। గోపక్రీడావినోదగోపాలునకున్॥ ...

గద్య. [illegible] హారితసగోత్ర వారణాసి వంశపవిత్ర కోటయ్యమూర్త్యపుత్ర పుల్లమాంబాగర్భశుక్తిముక్తాఫల రామయాఖ్యహరిదాస ప్రణీతంబగు శ్రీరామాచల పురాణబోధిని యను గ్రంథమునందు ద్వితీయ ప్రకరణము దత్తాత్రేయార్పణమస్తు.






# శ్రీరామాచలపూర్ణబోధిని.

## తృతీయప్రకరణము.

వశిష్ఠమహర్షి త్రిశంకునకు ఇట్లుజెప్పెనని శౌనకాదులకు సూతుండు జెప్పుచున్నాడు.

సీ॥ మాలతీమందార మాలూరజంబీర మాతులుంగ కపిత్థమరు
వసరళ। సాలరసాల తమాలచందన బిల్వపున్నాగ పనస
జంబూలవంగ। ఖర్జూర - నారంగ. కట్ఫలా క్రముకాది -
తరులతా, బృందంబు, దగినరీతి, ఫలపుష్ప భరితమై -
ప్రభగల శారికా - చక్రవాక మరాళ శరభ సింహ॥

గీ॥ గవయ వంచక శార్దూల ఖడ్గ ఝిల్లి। కేకిబకబలాహాక శు
క కిటియు నాది॥ విహగ మృగమత్త మధుకర వితతి కనువు
యైన కాసార గిరులొప్పు యాశ్రమంబు॥

వ॥ సాలరసాల బిల్వకదళీఖర్జూర జంబూజంబీరచందన పున్నాగమందారాది వివిధవృక్షనిబిడంబును, పుష్పఫలభరిత శాఖావనమ్ర తరులతాబృందంబును, మాధవీకుంజ మంజరీపుంజ మకరంద పానమత్త మధుకరనికరఝుంకారారవము ఖరితహరిదంతరంబును, క

నక కమలకల్హారవిలసత్సరోవిహారణమీన చక్రవాక బక క్రౌంచమ రాళ దంపతీమండల మండితంబును, మృణాళభోజనాసక్త సారసచయచంచూపుటవిపాటిత కమలముకుళ కేసరవిసరవితత ప్రశస్తసరోవరంబునునై వెలుంగునవ్వనంబున. జటావల్కల కృష్ణాజినోత్తరీయ, జపమాలికాదండకమండలధరులై, నిర్మలతపోధ్యానానుష్ఠానగరిష్ఠుండగు అత్రిమహాముని, సుఖాసనమున సమాధినిష్ఠయందధిష్టించియుండుయవసరంబున, సురాసురజేగీయమానుండగు శ్రీమహావిష్ణువును, త్రిలోకేశుండునగు, శంకరుండును, సృష్టికర్తయగు, బ్రహ్మదేవుండును, నారదునిచేనాకర్ణించిన యనసూయా పాతివ్రత్యముపరిశీలనమే పనిగాగొని బ్రాహ్మణవేషములు, భస్మరుద్రాక్ష త్రిపుండ్ర మాలికాధారులై కరముల గఱ్ఱలనూనకొని వడవడవడంకెడి, చమ్మగిలిన చమటగల మేనుల, క్షుధాతురులై, మిక్కిలిదురవస్థ, ననుభవించుచువారలు జరాభారాధికమున దేహమునందలి రక్తమాంసములుబోత్తుగాక్షీణించినవారలును, సైగనుపట్టుచు మెల్లమెల్లన అత్రిమహాముని యాశ్రమమును ప్రవేశించిరి.

పరమ పతివ్రతాశిరోమణి, సుగుణఖనియగు, అనసూయాదేవిని బొడగనిరి. సంతసించిరి. ఆమెతో సంభాషించు దలంపుగొనిరి.

విష్ణుండు. = ఓయమ్మా! మాగాఢయాసమున కడుడస్సితిమి. "గోరుచుట్టుపై రోకలిపోటు" యనునటుల క్షుద్బాధాపీడకులోనైతిమి. మాసంక్షోభమును శీఘ్రమున బాపంగల ఋషిపత్నివనినెంచితిమి. నినుగాంచితిమి. నీపుణ్యమపారమని వినియుంటిమి. క్షుద్బాధ నివారణమునకు వెనుదీయకుము. సమాధినిష్ఠనుండిపతియరుదెంచువరకు నిరీక్షింపకుము. మేము సంతసిలునటుల జేయుము. సకల దానములలోనన్నదానము. దానికన్నమెండగునదినిధానము. అనువాక్యమిప్పట్టున నెంచకుము. "అభ్యాగతఃస్వయంవిష్ణుః" అనునార్యోక్తినెఱుంగుము. కరుణార్ద్రహృదయవగుము. అనిబలికిరి. ఆవాక్యములువిని, నా

కోటిబ్రహ్మాండనాయకా! ఆదిమధ్యాంతరహితా! అవాఙ్మానసగో
చరా! బహుకాలమునుండి, పుత్ర వ్యామోహమునుండు మమ్ముస
ఫలీకృతమనోరథులగ గావించితిరే? అనవిని, మందస్మిత వదనారవిం
దుడైరి. కొంతసేపటికి నారాయణుండు, ఋషిపత్నీ! నీపతిచిరకా
లము నుండి సంతానమునకై తప మాచరించు చుం
డుటచే విశ్వసించినారము. బాలక్రీడలజూపెదము. నీమనోవాంఛను దీ
ర్చుకొనుము. అనికంటువడైరి. ఆమె చిఱుతబాలురగాంచి, వాంఛిత
మీడేరెనని, సంతసించి, గోక్షీరముల, నాముగ్గురుబాలురకు ద్రావిం
చెను. ఇంతలో అత్రిమహాముని యేతెంచెను. కందువ్వలకాంచెను. తే
నదివ్యదృష్టిని యుదంతంబంతయు నెఱింగెను. నివ్వెఱపాటొందెను. అ
త్రి ఋషిపత్ని ముఖమువీక్షించెను. భయాతురతజెందినదై పతిపా
దములకొఱగివేచి ముకుళితహస్తయై నాథా మనోచాపల్యమును ని
టుగావించినందులకు పుత్రవ్యామోహమునకును క్షమింపవలయునని
దీనవదనయై గద్గదస్వరమునబలికెను. అప్పలుకులాలకించి ఋషిపుం
గవుడు ప్రేయసీ నాతపస్సుఫలించెను. నీవివేకమునకు నాజన్మ సాఫ
ల్యమయ్యెను. ధన్యతజెందితిమి. ఇంతకన్నవలయు కార్యమేమున్నగల
దే వినుము. (సదేవ సౌమ్యేదమగ్రఆసీత్) అనుశృతిప్రమాణమును
లను తత్వమెతనకుదానై వెలుంగునదియై (దీప్యతేత్వయమేవతత్)
అనుప్రమాణరీత్యా స్వయంప్రభయై ప్రకాశింపుచుండును. అట్టిపర
బ్రహ్మమే జగదుత్పత్తికి కారణభూతుడును త్రికాలవర్తిత్వ జ్ఞానస్వ
రూపత్వ ఆనందమయత్వములను ధర్మములతో నొప్పెడివాడు సాత్విక
రాజస తామసములనెడి మూడుగుణములు గలిగిన తనమాయను ప్ర
వేశించి సాత్వికమున విష్ణుమూర్తిగను రాజసమున చతుర్ముఖుండు
గను తామసమున రుద్రమూర్తిగను ఈయాశ్చర్యకరమగు ప్రపం
చమున అణోరణీయాన్మహతో మహీయాన్ అనుశ్రుతిచేత అణువు
కంటె అణువుగాను మహత్తుకంటె మహత్తుగాను నుండుబ్రహ్మలను

నీవు బాలరూపులుగ జేసితివని మురియకుము. ఆమహాపురుషుఁడు పరా
పశ్యంతి మధ్యమా వైఖరీ అను వాక్కులకందనివాఁడు సర్వాధారో
నిరాధారః అనునట్టుల సర్వమునకు పట్టుగొమ్మయగువాఁడు అమో
ఘ సంకల్పుఁడు శ్రేష్ఠమైన జీవపరత్వయోగములగలవాఁడు జ్ఞానాధిక్య
ముచేత సమర్థుండగువాఁడు తనుస్థూలాకృతియగు విశ్వాకృతిగలవా
డు విశ్వమే వేదం పురుషః వేదమయుండు స్థూలమున సూక్ష్మములు
యిన ప్రపంచలీలారూపములు గలవాఁడు. స్థావరజంగమరూపములై
న సకలప్రాణులకును శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణ
ము, అనెడు, జ్ఞానేంద్రియములకును, వాక్కు, పాణి, పాదము, గుద
ము, గుహ్యము, లనెడు కర్మేంద్రియములకును, మనస్సు, బుద్ధి, చిత్త
ము, అహంకారము, లనెడి యంతరేంద్రియములకును, ప్రాణాపాన
వ్యానోదాన సమానములనెడు, పంచప్రాణులకును, వానియధిదేవల
కును, విషయములకును, మూలప్రకృతికిని, ఆప్రకృతివలనఁబుట్టినమ
హాత్తత్వమునకును, ఆమహాతత్వమువలనఁ గలిగిన, యహంకారమున
కును, దానివలనఁబుట్టిన, శబ్దస్పర్శ, రూపరస, గంధములనెడు, పం
చతన్మాత్రలకును, దానివలనఁబుట్టిన, యాకాశవాయురగ్ని, జలభూము
లనెడు పంచమహాభూతములకును, ఆపంచమహాభూతమయమైన, ప్ర
పంచమునకును, ప్రభువగువాఁడునై యొప్పుచు ప్రకృతిసంబంధములై
న, శాంత, ఘోర, మూఢవృత్తులుగల, సత్వ రజో, తమోగుణములు
ను, పుట్టుట, పెరుగుట, ముదియుట, చిక్కుట, చచ్చుట, మొదలగు
వికారములులేక, నిర్గుణ, నిర్వికారతచే, వెలుగుచు, సృష్టిస్థితిలయ
తిరోధానానుగ్రహములనెడు, పంచకృత్యములు చేయుటకు కర్తయై,
బ్రహ్మవిద్వరిష్ఠుండై, బ్రహ్మాండము మొదలు, మాయాండపర్యంతమై
న, మేలుగలుగఁ జేయువాఁడై, పదునాలుగులోకములు తనయందును,
తానాయాలోకములయందును గలవాఁడై. చతుర్ముఖ బ్రహ్మరూప
ముచేత సృష్టియు, విష్ణురూపమునరక్షించుటయు, మహేశ్వరరూప

మున, లయమొందజేయుటయు, గలవారయి యుందురు.

బ్రహ్మమానసపుత్త్రుండును, తాపసవర్యుండును, త్రిలోకసంచారియునగు, నారదమహర్షియొక్క కరుణవలన, నిన్ను బవిత్రతజేయ నిజరూపముల జూపక, బ్రాహ్మణ వేషధారులై విచ్చేసిరి. ఇంతవరకు "అహంబ్రహ్మాస్మి" యని, "మృత్యోస్సమృత్యుమాప్నోతి। యఇహనానేవపశ్యతి భయంద్వితీయాద్వి వై భవత్యాత్ ॥

అనుశ్రుతివలన, బ్రహ్మమువేరు, తానువేఱనెడుభేదబుద్ధియే, మృత్యువుగాన నద్దానిని నశింపజేసితివి, జ్ఞాననేత్రముచేత చూడందగినవస్తువను చర్మచక్షువులచేజూచి కృతార్థురాలవైతివి. ఇపుడునస్త్రోపనిషన్మయమైన దివ్యమంగళవిగ్రహముల నిర్వికల్పసమాధిచేత,

"సర్వంఖల్విదం బ్రహ్మబ్రహ్మైవాహమిదం। జగత్సకలం బ్రహ్మణోన్యం నకించన" అనునటుల స్వాభిన్నపరబ్రహ్మను గాంచెడి ఫలంబునమకూర్చితివి. భక్తవత్సలురు, పురాణపురుషులు, పరంధాములగువారల ననాయాసముగాదరిశించితిమి. అనిబలికి భక్తివినమ్రుండై,

కం॥ ఏనోభక్తుల కనిశం। బేనోరూపముల యందు నిచ్చ నిజంచు। న్నాయక భక్తులకోఱకై। యానానారూపముల దాల్తువ గుణుండ వయ్యున్ ॥

వ॥ అని ధ్యానింపుచు తన్మయు డయ్యెను.

"మ॥ ఒక సూర్యుండు సమస్త జీవులకుం దానొక్కొక్కడై తోచుపోలిక నేదేవుండు సర్వకాలము మహాలీలన్నిజోత్పన్నజ। న్యక దంబంబులహృత్సరోరుహముల న్నానా విధానూనరూప కుండైయొప్పుచునుండు నట్టిహరి నేత్రాగ్రింతు శుద్ధాత్మునై

వ॥ అని ధ్యానింపుచు, అనసూయయు నై మరచెను. అంత విరించి విష్ణువులో మనము పరిశీలనార్థము వచ్చి బాలురమై యుండుటకు గతంబెయ్యది. యన నారాయణుండు అనసూయ పతివ్రతలలో మిన్నయగుటచే మనలను గుర్తెరుంగుట ప్రథమ సంభాషణముననే తే

ట పడెను. భక్తిసంభ్రమముప్పొంగ ఇతఃపూర్వము గోరుటయేగాక ఇపుడు పుత్రవ్యామోహముగు పరచెను. అందునభక్తపరాధీనత గలిగి నీకీతలిని చ్ఛగించితి నని ప్రత్యుత్తర మొసగెను.

అనివచించిన వశిష్ఠువాక్యము లాలించి త్రిశంకుడు గురునకో న్యా నారదుండు తదనంతర మేమిచేసెను. నారదుని జన్మ మాదిగాగల వృత్తాంతము సవిస్తరముగా వినుటకు కోరిక వొడమినది. అవ లక్ష్మీ యు కథా కథన దక్షుండగు వశిష్ఠుండును చెప్ప దొడంగె.

## —: నారదుని వృత్తాంతము. :—

—:—:—

త్రిశంకమహారాజా! వైకుంఠమునుండి నారదుండు వెడలిపోయి త్రిమూర్తులు బాలురగుట నెఱింగెను. మిగుల సంతసము నొందె ను. తనలో తానిటు తలపోసెను. దెలిపెద వినుము,

శ్లో॥ ప్రథమంతారకంచైవ ద్వితీయం దండ ముచ్యతే। తృతీ యం కుండలాకారం చతుర్థం చార్థచంద్రకమ్। పంచమం బిందుసంయుక్తం ఓమితిజ్యోతిరూపకమ్॥ ఓం అనుదానియొక్క యుత్పత్తి యని తాత్పర్యము.

శ్లో॥ అనాహతస్యశబ్దస్యతస్యశబ్దస్యయోధ్వనిః। ధ్వనేరంతర్గతజ్యోతి। జ్యోతిరంతర్గతంమనః। తన్మనోనిలయంయాతి తద్విష్ణోఃపరమంపదమ్॥ సనాతమగునదియే, అనాహతము. దానినే బ్రహ్మమందురు.

అట్టిబ్రహ్మమే ప్రణవము. అయ్యదియే స్వయంజ్యోతి ఆతే జోమయపరబ్రహ్మమునందు శబ్దము. అందున, ధ్వని, దానియంతర్గత మందుగలదియే, నిశ్చలబ్రహ్మము. ఆపరబ్రహ్మము, రజ, స్సత్వ, తమో గుణాతీతుండై త్రిగుణసహితుండై సృష్టిస్థితి సంహారాదిభారక త్వమువహించినవాడై బ్రహ్మవిష్ణుసదాశివులను నామరూపములనొ ప్పినవాడై భాసిల్లుచు మాయాతీతుండయ్యెండెను. ... ...

ఇట్టి మహాయోగీశ్వరులగువారు పతివ్రతామహిమలోనైరి. అత్రిమహాముని యాశ్రమమున శైశవదశనుజూపి పూజలు గొనుచుండిరి నాశేషము గలిపించిరి. నాకీర్తినిలిపిరి, ననుధన్యులఁజేసి దృష్టినుండి స్థిరి. అనసూయాదేవి ననుగోరినమేరకు కలహాహాలమున త్రిమూర్తులనామెకడకనపిరిగద ? యామెవాంఛదీర బాలురఁజేసి సంతసింపుచుండెరు గద. ?

శా ॥ శ్రీకైవల్యపదంబునందు నను వాంఛించెందు యాశించుచున్ ।
పాకారిప్రముఖాళి జేయునుతులన్ భాసిల్లుయావిష్ణువున్ ॥
లోకాలోకములెల్లసృష్టికొరకై లోలుండునౌబ్రహ్మయున్ ।
నాకాపట్యమెఱింగి సైచిరిగదా నాసేర్పుదీపింపగన్ ॥

బ్రహ్మమానసపుత్త్రుండనగు భక్తునిపై వాత్సల్యముంచిరి. నా పలుకులయందలి నిజానిజములు తెలిసియేయుందురు. సర్వజ్ఞులకు తెలియనిదిగలదే? ఇంతేగాక,

గీ ॥ సర్వభూతాంతరస్థసుజ్ఞానచణుల । సర్వరూపక్రియాభావసాంజ్ఞవలన । సర్వదాఖండభాస్వర సత్యమనెడి । సర్వసముడగు ఈశ్వరు సంస్మరింతు ॥

## నారదుని జనన ప్రకారము. :—

—:o:—

పూర్వజన్మమున వేదవాదులగు బ్రాహ్మణులకిల్లు, వారలచే పెంపబడి, వారలకు శుశ్రూషలు జేయుచుంటెను. ఒకవానకాలంబున చాతుర్మాస్యంబున, నేకస్థలనివాసంబు సేయనిశ్చయించిన, యోగిజనులకుం బరిచర్య సేయుచుంటెను. ఎల్లప్పుడు బాలురతోనే యాటలకుఁబోక నేదోకజంఝాటంబును, లేక, భక్తినలుపుచుమంగళకరము నివారిల యెంగిలిభక్షింపుచు, వానకు నెండకు నోర్చి వారినెనువెంట వారియాజ్ఞాబద్ధుండై వర్షాకాల [illegible] నా

ను విష్ణుచారిత్రములను దువ్వుచు వసించుచుఁ బాడుచు, నర్చించుచు,
నుండ శాంతిమతియై పరిపూర్ణభక్తితో విష్ణుసేవారతుండై వసించుచుం
డెను. కొంతకాలమునకు, యమ్మహాత్ములగు యోగిజనులమూలంబు
న రజస్తమోగుణ పరిహారిణియైన భక్తిసంభవించి ఈశ్వర రహస్యా
ర్థ విజ్ఞానముగలిగెను.

ఇట్లులుండ నప్పుడ్డు తనమాతమాపు రేపును, మోహంబుసొంపార, ముద్దాడు
చు, జుంచుకున్నచు దేహంబునిమురుచుఁగౌఁగిటఁజేర్చుచు తనొలయం
తలసి పొలసియాకొంటివా! యని బలుక శుశ్రూష సేయ కష్టముగా
నుండెనని యెంచక యూరుచింతలేక హరిభక్తిజ్ఞానసంపన్నుండై యుండె
ను. యేడేండ్ల ప్రాయమున వానిమాత సర్పదష్టయై విగతజీవితయగు
టచేఁ దగుకృత్యములొనరించి పిదప గురువులనాజ్ఞగొని యుత్తరాభి
ముఖుండై పురంబులు బట్టణంబులు గ్రామంబులు పల్లెలు మందలు,
మహోద్యానంబులుఁ గిరాతపుళిందనివాసంబులు వనంబులుఁ జిత్ర
ధాతువిరచితంబైన పర్వతంబులు పథికజన శ్రమాతిరేకంబులయిన తో
టాకంబులు, బహువిధవిహంగనినద మనోహరంబులై, సరోవరంబు
లై వికచారవింద మధుపానపరవశపరిభ్రమద్భ్రమరసుందరంబులైన
సరోవరంబులుఁ దాటిచనుచుఁ క్షుత్పిపాసాసమేతుండై నదీప్రవాహం
బునఁ గ్రుంకులిడి శుచియై నీరు ద్రావి విగతశ్రముండై యట సాల
వృక కపి భల్లూక గోలేభ శల్య ఘూక శరభ శార్దూల శశ గవయ
ఖడ్గ వ్యాళాజగరాది మృగముల ఘీంకారములు గల వనము జొచ్చి
యందు సుస్థిరంబైన గుల్మలతా గహనంబుల పొంతనొక్కరావిమ్రా
ను క్రిందఁ గూర్చుండి భయంబించుకయు నొందక తన హృదయగతం
బున పరమాత్మ స్వరూపుని హృదయమందు నిలిపి ఇట్లు స్తుతించె

కం॥ పలుకుల జగవుల నడపుల। నలుకల నవలోకనము లనాభీ
ర వధూ। కులముల మనములతొలిమి। కొలుకుల వదలిం
చుమనుని గొలిచెద మదిలోఁ ॥

విద్యాసంపన్నుండెను. బాలుని నిశ్చలభక్తికి సంతసించి నారా యణుఁడు సాక్షాత్కరించి బాలకా నీభక్తికి మెచ్చితి నీవు దిక్కుమాలి న వాఁడవని భావించి శోకింపకుము. శీఘ్రకాలమున నీజన్మవిముక్తి నొం దఁగలవు. కం॥ నాయందు కలుగు నీమది । నాయెడ జన్మాంతరముల బాలక నీకున్। బాయంబు విడదివిరాదట। మాయను పతిబుట్టగలవు మద్భ క్తుండై ॥

వ॥ వినుమీ సృష్టియంబునందొండి యుగము క్షీణకాలం బు యూరిని యైపోయెడిం బోవఁగాఁగలుగుంజూవిన్మా మీరాయుద నాసృష్టి యుం । మనిరూఢస్మృతితోఁ డబుట్టెదవు నిర్దోషుండవై నాకృపచే। ఘనతం జెందెదవు శుద్ధసాత్వికులలో గణ్యుండవై యర్భకా ॥

అని పలికి యదృశ్యుండయ్యె. అనంతరమా బాలుండు నిర్మలాం తఃకరణంబుతోడ విషయవిరక్తుండై కాలమున కెదురుచూచుచు భూ మిం దిరుగుచు నుండు నంత గొంతకాలంబునకు మెఱపుమెఱసిన తెఱం గున మృత్యువు వచ్చిన పంచభూతమయంబును కర్మస్వరూపంబునై న దేహంబు విడచి శుద్ధసత్వమయంబయిన దేహంబు పొంది బ్రహ్మని శ్వాసంబు వెంట నతనిలోన బ్రవేశించి లోకంబులు సృజియించు కాల మున లోనుండి వెడలెను. ఇక్కారణమున నే బ్రహ్మమానసపుత్రుండన బఱగుచుండెను. ఈశ్వరునిచే గానవిద్యాభ్యాసము చేసికొని మెప్పువ డసెను. అంతనతండు బ్రహ్మాభివ్యంజకంబులయిన సప్తస్వరంబులు దన యంతనె మ్రోయుచున్న వీణ లభించెను. ఆయాలాపంబులం జేసి విష్ణుని పరమహాత్మ్యమ్మున నారదుఁడను నామము గలిగె. తదాదిగా నారాయ ణకథాగానంబు సేయుచు జరియించుచుండెను. ...

## ——* నారద వివాహము. *——

ఒకనాఁడు చతురాననుఁడు పుత్రవాత్సల్యమున నారదుని జీరి కుమారక నామాటను చక్కఁగా వినుము. సృంజయుఁడను రాజచం ద్రునకు రూపలావణ్యము సుగుణము మఱియు భక్తిభావము లొప్పినది

యు నగు నొక కొమరిత జన్మించెను. అత్యంతమును దినదిన ప్రవర్ధమా
నమై పరిస్ఫుటము వివాహ వయస్క యగుటచే నానాదేశపు రాకొమా
రుల రూపపటములఁ దెప్పించి కన్యకకుఁ జూపెను. ఆమె యా పటములనెవ్వా
నిని గనులఁ జూడక జనకుని పలుకులకు ప్రత్యుత్తరమీయకుండుటచే తం
డ్రి మిక్కుటముగా శోకమున మునిఁగియుండెను. సేయునరేశ్వరుండే
క ఏకపుత్రియు తరుణవయస్కయు భక్తివిశారదయు గాన నంగనను
నహింపలేక ఒకనాఁడు సుతను రావించి లాలించి ప్రేమతో కుమారీ
ధర్మము సేయవలదగదు. నీవు నొకరాజునితో గూడి సౌఖ్యమనుభవించుచుండ
గాంచు భాగ్యముగల్గఁ జేయుని కారణమెయ్యదియో యానతీయవలయు
నని వాక్రుచ్చెను. కన్య సిగ్గువడలనంచి కొంతసేపటికి నాయనా నేను
ది వఱకెన్నియో పర్యాయములు భగవంతు గానియన్యుల మొగము
చూడను. పలుకరింప నని నుడివి యుంటినే మరల ప్రశ్నింపనేల

మత్తకోకిల. దైవమాతఁడె నన్ను నేలెడిదాత యాతఁడె సుమ్మినా!
భావమంత హరించి యుండిన భాగ్యదేవత యాతఁడే । గావ
నన్ మహారాజసూనులు గాంక నే యుగ పోలుగా తీవరింపగ నే
ల తండ్రిరో దివ్యరూపుని గూర్చుమా ॥

వ ॥ అని వక్కాణించెను. భగవంతుని ప్రార్థించుటకంటె వేఱుమా
ర్గము లేదని కృతనిశ్చయుఁడయ్యెను. తదనంతరము భక్తిసిద్ధాగ్రగణ్యుఁడై
నారాయణుని గూర్చి తపము చేరించెను. సర్వేశ్వరుఁడు సాక్షాత్కరిం
చి నృపుంజయా నీభక్తికి మెచ్చితి. నావరంబున నీకు జనన్మైన పుత్రిక
పరమ భాగవతోత్తముఁడు శీఘ్రమున తనంతట తానే నిన్ను బొంబున
కు విచ్చేయును. నీవు తపము చాలించి వైవాహికమునకుఁ దగు సన్నా
హము జేసికొనుము. నిస్సందియముగా సర్వ సంభారములు గూర్చు
కొనుము అని పలికి అంతర్హితుం డయ్యెను. అనంతర మా రాజు సర్వ
మును సిద్ధపఱచుకొని యున్నాఁడు. కావున నీ వా కన్యను పరిణయముగా
చేసికొనుము. బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్యాసంబులలో

ఉత్తమంబగు నదిగృహస్థాశ్రమము.

గృహిణీ గృహ ముచ్యతే. • ధన్యో గృహస్థాశ్రమః

అను వచనముల ననుసరించి ఒకయువతిని వివాహముజేసుకొనుటపురుష ధర్మము. గృహమేధియైన పిదప యథాక్రమముగా స్నాన తర్పణ సంధ్య జప దేవపూజాగ్ని హోత్ర వైశ్వదేవ బలిహరణంబులు నిర్వర్తించి అన్నార్థులైన అభ్యాగతుల పూజించి ప్రశస్త మణిముద్రికా ధరుండును ధవళ వస్త్ర యుగ్మపరివృతుండును గంధపుష్పాలంకృతుడును శుద్ధోదకార్ద్ర పాదహస్తుండును ఆచమన క్రియాపరిశుద్ధ వదనుండునై యపరదిశాముఖుండుగాక పూర్వాభిముఖుండై సుఖాసనంబునగూర్చుండి, ప్రశస్తశుద్ధపాత్రంబులందు, సర్వగుణసంపన్నయైనధర్మపత్నివడ్డింప, పుత్ర, బంధు,మిత్ర, సహితుండై భుజించి, యుచ్ఛిష్టవారణార్థంబుగా, పాణి, పాద, ప్రక్షాళనంబు జేసి, స్వప్రశాంతచిత్తుండై కూర్చుండి, యభీష్టదేవతాస్మరణ జేసి, వేదశాస్త్రప్రసంగంబుల, భగవద్గుణానుకీర్తనంబుల, బ్రొద్దుబుచ్చుచుండవలయును. ఇటుల నీతిపరుండై కులాచార ధర్మంబు వదలక ధర్మార్థకామంబు లయందు సమధర్మియై పాప కర్మంబులు పరిహరించి సమస్త భూతంబులయందు స్నేహార్ద్ర చిత్తుండై అరిషడ్వర్గంబునందు బద్ధుండు గాక సదాచార సంపన్నుండై సాత్వికంబు వదలక త్రికరణ శుద్ధిగా వర్తించు పుణ్యపురుషుండు సర్వోత్కృష్టుండుగా నెన్నబడు నను వాక్యములు గమనింపుము. ఏయాశ్రమము జేరక యుండుట లెస్సగాదు కావున జనకుని వాక్య పరిపాలనా శీలుండవై విష్ణు భక్తురాలగు రాకొమరితెను వివాహ మొనరించు కొనుము,

శ్లో॥ స్నానం తర్పణ సంధ్య హోమ జపితే కిం తేన దానం వినా। నానాశాస్త్ర పురాణ వేదపఠితే కిం తేన జ్ఞానం వినా। వీణావాద్య మృదంగ గీతపఠితే కిం తేన గాత్రం వినా। తాంబూలాదిసుగంధపుష్పశయనే కిం తేన కాంతావినా

అనెడి నీతివాక్యము తప్పక నాచరణీయము. పితృవాక్య పరిపాలన విధికృతము. దైవపితృ హితము. భక్తి జ్ఞానములకనువగు కృత్యము. అనినుడివెను బ్రహ్మవాక్యములకు సంతసించెరు. అంతచతురాననుఁడు దేవేంద్రుఁడు మొదలగు వేల్పులరావించి నారదసహితముగ సృంజయురాజుపట్టణమునకుబోయి. పురమువెలుపల నిలచి, మంగళవాద్యములు మ్రోగించిరి. రాజు పట్టరానిసంతోషమున, వరపూజకు సపరివారముగావచ్చి, బహూకరించి దోడ్కొనిచని, విధ్యుక్తముగా, వివాహమంగళ ప్రయత్నముగావించె. కన్యాదానసమయమునరత్నభూషణములే గాక తనరాజ్యసర్వస్వమును ధారపోసెను. పెండ్లికొమరుని వెంటసేవించిన, బ్రహ్మమొదలగు దేవతలకుఁ, దగురీతికట్నములిచ్చెను. బ్రాహ్మణులు మొదలగువారలకు, మృష్టాన్నంబుల సంతుష్టిగావించెను. దేవతలు దివ్యదుంధుభులు మ్రోయించిరి. అప్సరసలాడిరి. గంధర్వులుపాడిరి. మునులు బ్రహ్మ వధూవరుల నాశీర్వదించి నిజనివాసములకు బోయిరి. వేల్పులుయథేచ్ఛముగాపురములకేగిరి. అనంతరమా నారదుఁడు. సుగంధిచందనార్చితంబయిన, రమ్యపుష్పతల్పంబున పత్నితోఁగూడి, మదన క్రీడలు సల్పుచు, సృంజయరాజుపురమున సుఖంబుగా నుండెను.

—:(. నారదునకు సనత్కుమారుఁడు జ్ఞానోపదేశము జేయుట. ):—

ఒక నాఁడు, సనత్కుమారుండా సృంజయరాజు పట్టణమునకరుదెంచెను. నారదుఁడు సగౌరవముగ దోడ్తెచ్చి గూర్చుండనియమించెను. ఆమహాఋషి తనదివ్యదృష్టిచేఁ నారదునివృత్తాంతమంతయు నెఱిఁగెను. భక్తినిబుఱిగొల్ప మదియందు దలపుజనించెను. ఇంతలోనా రదుండు, మహాత్మా! భవదీయాగమనంబున ధన్యుడనైతిని. నేనీసంసారంబున తగులంబడియుంటిని. నాకు విముక్తి మార్గమగుపడకున్నది. కృపతో ననుగ్రహించుమని ప్రార్థించెను.

అనంతరమా మునిపుంగవుండు, మందస్మితవదనారవిందుండై

నారదా ! నే వచించెద వినుము.

తొల్లి నీవు గంధర్వజన్మంబునఁ గామినీసుఖ మనుభవింపఁగోరి యుంటివి. ఆకాంక్ష నీమనంబున బూర్తిగా కుండెను. తదుపరి దాసీపుత్రుండవై, హరిభక్తసంగమంబున, బ్రహ్మమానసపుత్రుండవై, భక్తాగ్రేసరుఁడ వగుటచే మనజనకుని కృపాకటాక్షమున ననుభవించితివి. ఘోరసంసృతిబంధకారణంబగు, సంసారంబను దగులంబున జ్ఞానము వీడియుండుట తగదు.

గీ ॥ గర్భవాసబీజంబు దుర్గతికిఁ ద్రోవ । అమితపాపాత్ముఁడైననరాధముండు । కరము సుధయనుబుద్ధిచే గరళరసము । ద్రావిన విధంబుగాదె కాంతలసుఖంబు ॥

క ॥ పరుఁడగు నారాయణుఁడా । మఱచివిషయలోలుండైన మనుజుఁడుమాయన్ । దరియింపలేకగరళము । గుఱుతుగ నమృతమను బుద్ధిఁ గ్రోలుంగాదె ॥

కావున, మాయాస్వరూపమగుపురమును కాంతనువీడి యోగనిష్ఠాగరిష్ఠుండవగుమని మంత్రరహస్యార్థములు దెల్పిజనియెను. అనంతరము రాజు, యల్లుని బిలచి తనకు వార్ధకదశవచ్చెనని పుత్రులు లేరుగావున, రాజ్యపట్టాభిషేకము జేసుకొనుమని గోరెను. అందులకియ్యకొనక భార్యమొదలగు వారలు వద్దనివారించినను, పురమువిడచి వెడలి పోయెను. శ్రీమన్నారాయణా ! ఆర్తత్రాణపరాయణా ! సకలపాపవినాశనా ! నాకు ప్రసన్నుండవై సాక్షాత్కరించి నన్ను రక్షించుము.

క॥ అవివేకిసంసారవ్యవహారమునందుకల్గువాంఛనిరతమున్ । భవదీయపదంబులపై దవులన్వరమిచ్చినన్ను దయజూడగదే ॥

అని ధ్యానింపుచు వైకుంఠమార్గమునుబట్టి బోవుచుండెను. త్రిశంకచక్రవర్తికి పిదపజరిగిన చర్యవినుము. ... ...

—(చంద్రునిచే ప్రచేతసులకు మరీషియను కన్యనిచ్చుట.)—

పృథుచక్రవర్తికి రెండవకొమరుండగు నంతర్ధికి శిఖండియందు హావిర్ధనుండుపుట్టె. వానికి నాగ్నేయియైన ధిషణయను దానికి నొక్కతనయుండుపుట్టె. వాఁడుకుశలుండై యజ్ఞకాలంబునఁ గుశనిచయంబుఁ బ్రాచీనాగ్రంబుగా నొనరించుటంజేసి ప్రాచీనబర్హియనం బరఁగె. అట్టిప్రాచీనబర్హికి సముద్రపుత్రియైన సౌవర్ణయనుదానికి ధనుర్వేద పారగులగు ప్రచేతసులు పదిమంది జనించిరి. వారుపృథగ్భేదంబులేని ధర్మంబులం బ్రవర్తిల్లుచుండిరి. ఇటులుండ నొకనాఁడు కుమారులతో బ్రాచీనబర్హి నిటులనియెను.

తే ॥ గీ ॥ వేలుపేదిధర్మంబుల విస్తరిల్లు । మీకుఁబడయంగరానిదేమియును లేదు । కాన నాయాజ్ఞఁబూనియుగ్రంపుఁదపము । సలిపి పంకజనాభుంబ్రసన్నుఁజేసి ॥

తే ॥ గీ ॥ భావికాలంబునకుఁబ్రజాపతివిలాస । ములువహించిచరాచరభూతసృష్టి । నర్థిఁగావింపుఁడనుటయు నట్లుగాక । యనియొప్పబడిరందఱు నధికభక్తి ॥

పితృవాక్యపరిపాలనకై సాగరముకడకేగిరి. సాగరోదకమధ్యను ప్రవాహంబున పదివేలవత్సరములు నారాయణునిగూర్చి ఘోరమగుతపమాచరించిరి. అట్టితపమునకుమెచ్చి భక్తవత్సలుండు శంఖ చక్ర గదా శార్ఙ్గములు పట్టుపీతాంబరముధరించి, వారియెదుటసాక్షాత్కరించి యోబాలులార నీభక్తికి మెచ్చితి. తపము చాలించి మీకు వలయు వరములఁ గోరుఁడు. అన వారలు సమాధినిష్ఠ చాలించి లేచివందనము లాచరించి,

ఉ ॥ ఓకమలా మనోరమణ యోజగదేకపవిత్ర యోశుభాలోకన యోపయోజదళలోచన యోమహనీయ కౌస్తుభస్వీకృతవక్ష యోసుగుణశేఖర యోకరుణాపయోనిధీ మాకుఁ బ్రజాపతిత్వములు మన్ననతోడ ననుగ్రహింపవే ॥

యని ప్రార్థించిరి. నారాయణుండు మీరుకోరినవరములు మీ కుఁగలుగఁబోవు. మీపుత్రుని యందనుగ్రహించితిమి. ఆతండుదక్ష నామంబునఁ, ప్రజాపతియగునని వరంబిచ్చి, యతర్ధానంబునుఁబొం దె. ప్రచేతసులు పురముఁజేరిరి. అరాజకముగనుండుటచే రాష్ట్రమం తయు, నపవులు పెరిగి, ప్రజాక్షయమగుట నెఱింగిరి. తపోమహాత్మ్యం బున ఝంఝానిలంబులుగల్పించి, మహీరుహంబుల, నిర్మూలంబుగా భస్మీభూతంబు జేయుచుండిరి.

అప్సరి చంద్రుండు,

సీ ॥ ముఖమను శశిబింబమునకుఁ గస్తూరికాతిలకకళంకంబు చెలు వుమెఱయ । ధమ్మిల్లమనుగాఢతమసంబులోఁ బుష్పచయ తారకావళిసొరుమీఱఁ । గనుమూపులను మన్మథునిమో హనాస్త్రంబులందుఁ గాటుకమచ్చసందడింప । శృంగారమ ను సుధాసింధుమధ్యంబున వళితరంగశ్రేణివన్నె కెక్క ॥

గీ ॥ ఘనకుచములనుకిన్నెరగాయలకును । బట్టువయ్యెదగప్పసెన బాగుసూప । సకలసౌభాగ్యలక్షణచారుమహిమ । నుల్లసి ల్లెనుకన్యకనోర్తుఁదెచ్చి ॥

క ॥ మానవపతి నందనులకుఁ । గానుకగానిచ్చి వారిఘనకోపం బులో । వానిచివినయువిధేయుంరైన । లినవిలోకవారికని రెం ప్రీతి ॥ వి ॥ పు ॥

రూపలావణ్యాతిశయ యగు కన్యాలలామనుదెచ్చి "రత్నహస్తేన నో పేయాద్రాజానం దైవతంగురుమ్" అనియున్నది. కావున రాకొమరులా గా । కన్యకాలలామను కానుగాగొని వికాకోపానలంబు జల్లార్చ్చు ను "ఉత్తమస్య క్షణంకోపం" బనునది గమనింపుఁడు. ఈకన్య కథ పూర్వచరిత గ నెఱుంగుడు. ఈసొజననవృత్తాంతము వినుము.

కంఢుండను మునీద్రుండు, గోమతీతీరంబున, ఘోరతపంబు సే యుచుండుటెఱింగి యాతని తపోమహాత్మ్యంబునకు సంక్షోభించి దేవేం ద్రుండు, ప్రమ్లోచయను యప్సరసకన్యను, తపము చెఱచుటకుఁబం

పెను. అమ్మచ్చరకన్య గిరిమగణములతో దగ్గినసేయందగు నీవుపా
లిండ్లు, కుసుమమాత్రస్వరూపులం బోలునేత్రములు, శంబరివైరి నిమంచును
వాలంగొనందగు నూగారు, చెలువునింగిణీవింటికోలనదగు భ్రూలము
గము, మదుని రథచక్రమునందగు జఘనములు, చుర్వాపుష్పము గేలి
సేయు నాసికయు, చిగురుటాకులబోలు పాదములు, చంద్రసదృశ
మగు మొగము గలిగి మెఱుంగుడీగె కైవడియగుచు, తాపసోత్తముని
కడకరుదెంచెను.

ప్రాతఃకాలసంధ్యావందనాది కృత్యములదీర్చుకొని యాశ్రమ
మున కేతెంచు కంధుండను తాపసునిగాంచెను. చలింపని హృదయ
ముగలది యయ్యును. సాష్టాంగవందన మాచరించెను.

సీ॥ తనశరీరము కమ్మతావిమూర్కొనునట్లుగా వినోదమునకైగా
ంబోలయుం। దనమోహనాకృతిం గనుంగొనునట్లుగా ముం
దర బిబ్బోకముగ నటించుం। దనకంఠరవములు వినవచ్చునట్లు
గాం బగవాడినుఱు నవ్వించుచుండుం। దనమోవి రుచికై
కొనవచ్చునట్లుగాం దియ్యని ఫలములు దెచ్చియిచ్చుం॥

గీ॥ దనకరాలింగనమునకుం దగునట్లు। గాశరీరంబు మోనగుం
గడసి మొక్కు। నిక్కమంగున సమ్మునివిత్తవృత్తిం। గలంచి
మదనాతురునింజేసె జలజనయన॥

ఇవ్విధంబున మదనాతురుండై మునివరుండు,

తే॥ గీ॥ పొంకపుకెమ్మోవి చవిచూచి పొదలుగబ్బి। గబ్బిచా
లిండ్లు గదియంగం గౌగిలించి। సురతసుఖములం దనివోవం
జొక్కుచున్నం। గాని వృద్ధాప్తిచేం బ్రతుకంగజాల॥

వ॥ తలంచి తడబాటు పెదవులం దడపికొనుచువచ్చి రానిమా
టల వచించెను. "కామాతురాణాం నభయం నలజ్జా" యను
నట్లు మదనతాపమున కోడిన తాపసునకు వ్రతనిష్ఠయందు మరపును
గాంతయందు వలపును గలిగెను. ప్రవ్లోచనసఫలీకృతమనోరథయగు

హావహించిన తపసి తమిదీరని తమకంబున,

ఉ॥ మ్రొక్కెదసుగంధి నామనసు మోహము నాటెడి పట్టిసేవ్రుస
న్నొక్కక నీవు నాయెడసదయా తగవా మగవారిచిత్తముల్
ప్రక్కలసిలంగఁ జేయు బొరపొచ్చెము లాడఁగ నేఁడు నాకికే
చెల్లును స్త్రీఁబో వ్రతము చెడ్డసుఖంబును దక్కదయ్యెఁగా॥ వి॥ పు॥

వ॥ అని ప్రత్యుత్తరమీయ శాపభీతిచే నూరకుండెను. కొన్ని
పెక్కు కాలము గడచిన పిదప ఒక్కనాఁడు సంధ్యా సమయంబున
తాపసోత్తముఁడు పర్ణశాల వెడలి నదీ తీరంబునకుఁ బోవనుద్యుక్తుం
డగుట నవలోకించి కాంతాలలామ మీరెందుబోయెదరని ప్రశ్నించె
ను. తాపసుఁడు సాయంకాల సమయ మాసన్నమైనది. సంధ్యావంద
స్థానముల దీర్చుకొనఁ బోవుచున్నాఁడ ననెను. చకోరాక్షి నవ్వుచు
నోహరా? యింతకాలమునుండి యెన్నఁడు లేనియనుష్ఠానవిధానవేళ
జరుప దలంచితి రనెను. సఖియా ఈనదిలోనఁ బ్రభాతకాలమునఁ సం
ధ్యాది నియమంబులఁ జరిపి వచ్చితిని. ఇప్పుడు సాయంకాల మగుచు
బోవ నుంకించితి ననెను. సమయమునకై కాచి యుండు బ్రహ్మలోచనకు
యానందము జనించెను.

ఉ॥ అచ్చపలాక్షి యిట్లనియె నాతనితోఁ బ్రభాతకాలమే । న
చ్చుటయున్నిజంబు మునివర్య పిశాప్రహసువిహ్వలయ్యెయు ।
బొచ్చెమునొందఁ దీనమునఁ బోయినయేఁడులు [illegible]
[illegible] । నచ్చుగ నేఁడు మొదలు నెలలాఱుదినంబులు మూఁడు నేటి
తోడ ॥

అనిన నివ్వటిగందికాంతా ! నీవు మిథ్యావాద మొనరించితివా
లేక నిక్కువమా ? నేను మదనవ్యాపార వారాశిలో మునుఁగుచుండుట, నొ
క్కదినముగ భావించితి. బ్రహ్మజ్ఞానినగు నాతోఁ, నసత్యము పల్క
నేరవా ? యని యోగదృష్టింజూచెను. నిరర్థక ప్రహర్షనంబున
నవబోధనంబుఁ గోలిపోతినని ఖేదించి, బ్రహ్మలోచి ! ఈతప్పుసేసితిగాను,

మహేంద్రుండు, జేసినకపటము. ఇంతకాలము నాతోఁ గూడి యుంటివిగాన నాకోపము పశమించుకొంటిని. నీవీతక్షణమున వెడలిపొమ్ము. లేదేని, నాశాపమునకు లోనగుదువు. అనుమునీంద్రుని కోపాగ్నిలోలులకు కరంగవలంగాంచి భయాకులిత మానసయై. చెమటచెమ్మటలు నిండి యొడలెల్ల వడంక. బదులు పలుకక, గగనంబున కెగసెను. లేఁతమాసములుగల గర్భంబగుటచే స్రవించి, శరీరంబునవయవంబులయందు నమ్మునివీర్యంబు, స్వేదరూపంబున నుద్గమించెను. చంచలాక్షి బాలతరుపల్లవంబులఁ జెమటఁ దుడుచుకొనుచు. దేవలోకంబునకు నరిగెను.

క॥ మునుకంధునకును బ్రహ్మా । చనకు సమీరునకు నాకు సా
లంబులకున్ । వినుడొక్క రూపమూరిష । యనఁబరఁగిన
యీమృగాక్షి కతివలు సరియే ॥

క॥ తరుపల్లవములసమ్ముని । వరువీర్యము నిలిచి వాయువశము
న నమ్మృత్తో । త్కరమగు నాకిరణంబులఁ । బరివృతమై
యీలతాంగి ప్రభవించె నొగిన్ ॥

కావున, వృక్షరక్షణార్థంబుగా నీమృగాక్షిం బాణిగ్రహణము జేసుకొనుడు. ఈమె పూర్వ జన్మవృత్తాంతము వినుడు.

—:మారిష పూర్వజన్మవృత్తాంతము:—

ఇది తొల్లి ధరణీవల్లభుని యిల్లాలు. బాలవైధవ్యమునందు, హరినిగూర్చి భక్తిసల్పినంత, ప్రత్యక్షంబై వరములుగోరుమన, పతి పతి యని పదిమారులుచ్చరించ, ననుగ్రహించెను. అయోనిజనై జనించి, ప్రజాపతిత్వము గల పుత్రుని బడసి మహావిభవములనుభవింపవలెన నయ్యధియు నిచ్చి. బ్రహ్మణ్య దేవుండంతర్హితుండయ్యె. ఆకారణమున, నీరీతి యీజన్మమెత్తెను. ఈమెచు మీరు పరిగ్రహించిన, మహాభాగుండును, నతి వీర్యపరాక్రముండును, ప్రజాపతి గుణోపేతుండును, నైన కొడుకుదయించును. చరాచరముల నిర్మింప సమ.

ధుఁ డండగును. భావికాలకార్య గౌరవంబులకు మీకు ననుకూలము గలదు. కావున, నీమెను మీరు పదుగురు పరిణయము గావించుకొనుఁడని నొడంబరచి పాణిగ్రహణము జేయించెను.

—:దక్షప్రజాపతి జననము:—

క॥ ఆ రాజన్య తనూభవు । లారమణిం బరిగ్రహించి రాసతినవ
నగ౯ । నీరజ భవనిభుని మహో । దారుని బుత్రకుఁ గనిరి
ప్రచేతసుండనగ౯ ॥

ఆదక్షప్రజాపతి దేవదానవ గరుడ గంధర్వ సిద్ధవిద్యాధరాది నానాభూతంబులను ద్విపాద చతుష్పాద నానాజంతుజాలంబులను బుట్టించుచుండెను. అతండు మహాతపోనిధి గావున దక్షునకెవ్వండును గల్పంబులు లేవు. సృష్ట్యర్థంబుగా ప్రతిమన్వంతరంబునందును యుగంబులనొక్కొక్క ప్రజాపతి దక్షనామంబున జన్మించి సృష్టికిం గర్తయయ్యెండు గావున ప్రచేతస పుత్రుండైన దక్షప్రజాపతి పరబ్రహ్మ దక్షిణాంగుష్ఠమున జన్మించెనను ప్రతీతిగలిగి పూజ్యుండయ్యెండెను.

—:దక్షకుమారులకు నారదుడు జ్ఞానోపదేశము చేయుట.:—

కం॥ బహువిధముల బహుముఖముల । బహురూపములైన ప్రజల బహులోకములన్ । బహుళముగ జేసిమదిలో । బహుమానము నొందదయ్యె బ్రఖ్యాతముగన్ ॥

ఈవిధముగ దక్షప్రజాపతి ప్రజాసర్గముచాలక చింతించి మాంతనంబున లక్ష్మీకాంతుని సంతుష్టుం జేయనెంచి సర్వదురితహరణంబగు వింధ్యపాదమునందఘమర్షణంబను తీర్థంబు గాంచి యట ఘోరంబయిన తపంబు సేయుచు హరిం బ్రసన్నుఁ జేసికొని హంసగుహ్యంబను స్తవరాజంబున నారాయణుని.

"గీ॥ తవిలి గుణముచేతఁ దత్త్వబుద్ధులచేత
నిగిడి కానరాని నెలవువాని,
మొదలఁ దానకలిగి ముక్తిమానావధి
రూపమైన వాని బ్రాపు గొందు॥ "

వ॥ వాగ్బుద్ధిక్రియ మానసంబుల చేతం జెప్ప నిట్టిదని రూ
పింపనలవిగాక యెవ్వాని — గుణరూపంబులు శక్తులును నెవ్వాడు నిర్గు
ణుండు నెవ్వని వలన సర్వంబు నుత్పన్నంబగు - నెవ్వని వలన స్థితిం
బొందు నెవ్వని వలన లయంబగుం ———————— బరా
పరంబులకు బరమంబై యనన్యంబై ప్రాక్సిద్ధంబై సర్వవ్యాపకం
బై యనాదికారణంబై యున్నతత్త్వంబు నాశ్రయించు నెవ్వని ప్రభావం
బు మాటలాడెడు వారలకు వాదంబుసేయువారలకు వివాదస్థానంబు
లగుచు నప్పటప్పటికి మోహంబునొందించుచుండు నట్టియనంతగుణం
బులు గల మహాత్మునకుం బ్రణామంబుసేయుదు, "అస్తి" "నాస్తి"
యనువస్తుద్వయనిష్ఠలంగలిగి యొక్కటను గలిగి యుండివిరుద్ధధర్మం
బులుగనుండు నుపాసనా శాస్త్రసాంఖ్యశాస్త్రంబులకు సమంబై యే
ర్పడదగిన పరమంబు వాకునుకూలంబగుం గాక నెవ్వండు జగదను
గ్రహంబు కొఱకు జన్మకర్మంబుల చేత నామరూపంబు లెఱుంగ
బడుచుండు నట్టి నామ రూపంబులు గలిగి తేజరిల్లు ననంతుండైన భ
గవంతుండు ప్రసన్నుండగు గాక యెవ్వండు జనుల పురాకృత జ్ఞాన
పదంబుల చేత నంతర్గతుండై మేదిని గలుగు గంధాది గుణంబుల నా
శ్రయించిన వాయుభంగి మెలంగుచుండు నా పరమేశ్వరుండు మదీయ
మనోరథంబు సఫలంబు సేయుంగాక యనుచు భక్తి పరవశుండై స్తు
తియించెను. భక్తవత్సలుండైన పరమ పురుషుండు నిజరూపము గను
పఱచెను. దక్షప్రజాపతి సంతోష మపార మాన్యుడై సాక్షాత్క
రించిన సర్వేశ్వరుని సర్వాతిశయంబయి మహదాశ్చర్యకరంబయి తే
జరిల్లు దివ్యరూపముగాంచి భయంబును హర్షంబును విస్మయంబును
జిత్తంబున ముప్పిరిగొని చొప్పుదప్పింపం జెప్పరాకప్పుడు పాటుసంబు
ధమిపై సాగిలంబడి దండప్రణామంబు లాచరించి కరకమలంబుల
మొగిడ్చి నెలవేరులతోఁ గొట్టువడి యుట్టిపట్టు చాలక నిట్టవొడి
చి మున్నీరు దన్ని విలిచిన పెన్నురువుం బోలె సర్వాంగంబులుం దొంగి

లించి చిత్తంబు నాత్మాయత్తంబు జేసి పిక్కటిల్లిన సంతోషంబు చేత భగవంతుం బలుకను నత్యంత సందోహ పావనంబులైన నవ్యాంగం బు లుగ్గడింప నతిసత్ఫలంబులైన తదీయ కర్మంబులు దపంబును విబు ధహర్ష కరంబులైన తత్పౌరుషంబులు పొగడను వాక్యంబు మనోరథం బు పాత్రమవ్వనోపక ప్రజాకాముండై యూరకున్న ప్రజాపతిం జూచి సర్వజీవ దయాపరుండును సర్వసత్వహృదంతరుండును సర్వజ్ఞుండును గావున నతని భావంబు దెలిసి జగన్నాథుండార్త పోషణంబులైన భాష ణంబుల

క॥ మెచ్చితి ప్రాచేతస తప । మిచ్చట ఫలసిద్ధియయ్యె నిట్టి భక్తిన్ ।
హెచ్చగు మద్విభవము । నచ్చపడం బొంద నెవ్వఁడర్హుఁడు జగతిన్॥

గీ॥ తపము చాలు నింక దగ భూతతతికి. విభూతులొనరుగాక పొందుపడగ
విధియు నమ్మ మాకు నిచ్చలోగల కోర్కె । పొసగ నీదు వలన
బొందు పడిరె॥

వ॥ మఱియు వినుము. బ్రహ్మయు భర్గుండును బ్రజాపతులు నింద్రులును వీరలు నిఖిలభూతంబులకు భూతిహేతువులయిన మద్భూ తి విభవంబులు మఱియు నాకు యమ నియమాది సహిత సంధ్యావం దనాది రూపంబగు తపంబు హృదయంబు సాంగజపధ్యాన రూపం బగు విద్య శరీరంబు ధ్యానాదివిషయ ప్రవ్యాపారంబుగా నుండు భా వనాది శబ్దవాచ్యంబగు క్రియయాకృతియు గ్రతుజాలంబు లంగంబులు ధర్మంబాత్మ దేవతలు ప్రాణంబులు నిగమంబు మత్స్వరూపంబు జ గదుత్పత్తికి నాదియందు నేనొక్కఁడన తేజరిల్లుచుంటి బహిరంతరంబు ల వేఱొక్కటి లేదు. సుషుప్త్యవస్థయందు సర్వంబు లీనంబగుచుండ చే సి సంజ్ఞానమాత్రుండు నవ్యక్తుండును గాకుండు జీవుని భంగి నొక్కఁడ నైయుండుదు. అనంతుడనైయనంత గుణంబులుగల మాయాగుణంబు వలన గుణవిగ్రహంబగు బ్రహ్మాండంబు నయోనిజుండు స్వయంభువుం డగు బ్రహ్మయును నుదయించిరి. మదీయవీర్యోపబృంహితుండయి

హాదేవుండగు నాబ్రహ్మ యసమర్థుని బోలె సకృతార్థమన్యమా
న మనస్కుండనై సృష్టింపనుద్యమించుతరితపంబాచరింపుమని నాచేత
బోధితుండై యటుసలిపి తొలుతస్పృష్టికర్తృత్వంబువహించి మిమ్ముసృ
జియించెను. పంచజనుండను ప్రజాపతి తనూజయగు యసిక్ని యను
పేరట వినుతినొందియున్న యిక్కన్యకను నీకిచ్చెద. దీనింబత్నిగాస్వీ
కొనిన మిథునవ్యవాయ ధర్మంబుగలవాడవై మిథునవ్యవాయ ధర్మం
బుగల యీనాతియందు ప్రజాసర్గంబు నతివిపులంబుగ గావింపంగ
లవాడవు. అనిబలికి విశ్వభావనుండైన హరిస్వప్నోప లబ్ధార్థంబునుం
బోలె నంతర్ధానంబు నొందెను. అనంతరము దక్షుండు యసిక్నియను
నామెయందు నైదువేల పుత్రులగాంచెను. ధర్మశీలురైన యబ్బాలురు
పితృనిర్దేశంబున ప్రజాసర్గంబుకొరకు, సింధుసముద్ర సంగమంబున,
సమస్త దేవముని సిద్ధగణసేవితంబై, దర్శన మాత్రంబున నిర్ధూతకల్మ
షులను, నిర్మలచిత్తులంజేయు, నారాయణ సరస్సు సమీపమున, ని
ర్మలాంతరంగులై, పరమహంస ధర్మమునందు, నుత్పన్న మతులై,
తపంబులు సల్పుచుండిరి. నారదుండచ్చోటికేతెంచి, వారియభిప్రా
యంబెఱింగి,

క ॥ జలజ భవాదుల సర్వముఁ । గలయంగాఁజూచి దేశకాలక్ర
మముల్ । దెలియక ప్రజఁబుట్టింపం । దలఁచుట మీకెల్ల
హాస్యతన మౌఁగాదె ॥

క ॥ నిజమైన పరమాత్ముండిటు । నుండంగా యెరుగలేక యో
గుల మనుచున్ । యొండల వానల మంచుల । నుండినమో
క్షంబు లేదు యుర్వీ రమణా ॥

అనుట మీరెఱుంగ కుండుట కడువిచారము జనించినది. వి
దేహ కైవల్య మార్గము విడుట మేలుగాదు. అన నారలట్టి మా
ర్గముఁ బ్రసాదింపుమని, వేడిరి. అంత నారదుండు జెప్పఁదొడంగె
ను. బాలులారా! శ్రద్ధతో నాలింపుఁడు. సకల ప్రాణులకును, స్థూ

ఉళరిశేషముతోడి పుట్టుకతోనె మరణము కలుగు చున్నది.

శ్లో॥ జాతస్యహి ధ్రువోమృత్యుర్ధ్రువంజన్మ మృతస్యచ । అద్యవాబ్దశతాంతేవా మృత్యుర్వై ప్రాణినాంధ్రువః । అనిత్యాని శరీరాణి విభవోనైవ శాశ్వతః । నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యం ధర్మ సంగ్రహం ॥

అను, ప్రమాణము వలన, ఈస్థూలదేహమునకు, మరణము తప్పక కలుగును. మీరు ప్రయత్నించుచుండు జీవకోటి నశించున దేగాని, శాశ్వతముగా నుండునవి గావు.

శ్లో॥ స్వప్నే స్వాంతర్గతం విశ్వం । యథా పృథగవేక్షతే ।
కోజాగ్రతి విశేషోస్తి । జగచేత ద్వ్యమృశ్యతాం ॥

వ॥ అను ప్రమాణము చేత పురుషుఁడు స్థూల దేహావస్థయైన జాగ్రతలో నున్నప్పుడు తాను చూచిన దేవతలు రాజులు మొదలగువారును తానువిన్న దేవేంద్రాదుల వృత్తాంతములును సూక్ష్మదేహావస్థయైన, స్వప్నములో తనకే తోఁచినట్లుగా, తనచేత చేయబడినవన్నియు నటులనే యుండును. "జ్ఞానాని సర్వకర్మాణి భస్మసాత్కురుతేతథా." అనువాక్యము గుర్తెరింగిన పరబ్రహ్మ సాలోక్య, సారూప్య, సామీప్య సాయుజ్యములు బొంది శాశ్వత సుఖానందము నొందుదురు. కావున, విదేహకైవల్యమునకుఁదగు, మంత్రమును జపించుమని, అష్టాక్షరి బోధించెను. వారామంత్రరాజమునుష్ఠించిరి. తక్షణమే సహజ సత్వబ్రహ్మమయమైన, యానంద మనుభవింపజేరబోయిరి.

నారదునివలన సుతులు బ్రహ్మపదంబు జేరుటవిని పలువిధముల శోకించు దక్షునికడకు చతురాననుఁడేతెంచి దుఃఖోపశమనము గావించెను పిదప రెండవ భార్యయగు వైతరణి యందు శబళాశ్వులను కుమారుల, నేవురబుట్టించెను.

వారలు తండ్రిపనుపున నారాయణ సరస్సను పుణ్యతీర్థమునకేగినటు

